సరస్వతీ గ్రంథమాల. 46 పుష్పము

సంపాదకుడు; అధ్యక్షులు;

కె. యస్. యన్. మూర్తి,

కాకరపర్రు.

# ప్రేమఫలితము.



గ్రంథకర్త:

గుంటూరు శ్రీహరి, బి. ఏ.,

యలమంచిలి.

1938

 [వెల రు 0—12—0.

# సరస్వతీ గ్రంథమాల.

శాకరపఱ్ఱు—పశ్చిమ గోదావరిజిల్లా.

స్థాపితము 1923.

——:0:——

ఈ గ్రంథమాల యందు మూడు మాసముల కొక గ్రంథము చొప్పున నవలలు, నాటకములు (సాంఘిక, చారిత్రాత్మక) ప్రచురింపఁబడుచుండును.

| | | |
|---|---|---|
| సంవత్సర చందా రు. | | 2—8—0 |
| ప్రవేశ రుసుము | | 0—8—0 |

| | శాశ్వత చందా. | సంవత్సర చందా. |
|---|---|---|
| మహారాజపోషకులు | 500—0—0 | 50—0—0 |
| రాజపోషకులు | 250—0—0 | 25—0—0 |
| పోషకులు | 125—0—0 | 12—8—0 |
| సహాయులు | 50—0—0 | 5—0—0 |

ఇదివరలో గ్రంథమాలలో బ్రచురింపబడి అమ్మకమునకు సిద్ధముగ నున్న గ్రంథములు. అన్నియు ఒకేసారి కొనువారికి రు 12/-ల కొసంగబడును.

| | | |
|---|---|---|
| 1 | కనకాంగి Approved | 0—8—0 |
| 2 | విజయశ్యామ్ Approved | 0—12—0 |
| 3 | ప్రేమమహిమ Approved | 1—0—0 |
| 4 | బిలమందిరము Approved | 1—8—0 |
| 5 | మహారాష్ట్రజీవనప్రభాతము 2 భాగములు Approved | 1—8—0 |
| 6 | దుర్గావతి | 0—12—0 |
| 7 | హత్యారోపణము | 0—12—0 |
| 8 | కష్టసుఖములు 2 భాగములు Approved | 1—8—0 |
| 9 | నీలిపూలు | 0—12—0 |
| 10 | పతితనళిని 2 భాగములు Approved | 1—8—0 |
| 11 | అకాలీల సత్యాగ్రహము | 0—12—0 |
| 12 | శ్రీమచందుకథలు Approved | 0—12—0 |
| 13 | నీతిముక్తావళి Approved | 0—2—0 |
| 14 | కలము | 0—2—0 |
| 15 | నా ఎలెక్షను అనుభవము | 0—12—0 |
| 16 | రాజ్యపాలనాశాస్త్రము | 0—12—0 |
| 17 | మరణభ్రమ | 0—12—0 |
| 18 | చిత్తోడుపతనము | 0—12—0 |
| 19 | కమలావిలాసము | 0—12—0 |
| 20 | తమోభవనము 2 భాగములు | 1—8—0 |
| 21 | సంయుక్త | 0—12—0 |
| 22 | చిట్టెమ్మ | 0—12—0 |
| 23 | రాధానంతము | 0—12—0 |
| 24 | వెంకట కృష్ణరాయ జీవితము | 0—12—0 |
| 25 | భరతశతకము | 0—2—0 |
| 26 | శ్రీమభలితము | 0—12—0 |

# శాశ్వత మహారాజ పోషకులు.

—:0:—

1 మహారాజశ్రీ శ్రీరాజా విజయ అప్పారావు నవాయి అశ్వరావు జమీందారు, వ. బాదుషాహి మన్ సబుదారుసర్కారు ముస్తఫాన్నగరు. సంస్థాన్ పాలవంచ శ్రీభద్రాద్రిదలం అండ్ నిడదవోలు దొరవారు శనివారపుపేట

2 ,, చుండూరి నారాయణరావుగారు బ్యాంకర్సు,

3 శ్రీ శ్రీ శ్రీ సురభి వెంకటరత్నమాంబనిజాం నవాబ్ వంతుబహద్దరు. మహారాణీవారు జటప్రోలు సంస్థానం, కొల్లాపురం

4 ,, రాజా వెంకటాద్రి అప్పారావు బహద్దరు జమీందారు వారు వుయ్యూరు యెస్టేటు, నూజివీడు.

5 ,, దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఆంధ్రపత్రికా సంపాదకులు, మద్రాసు.

6 ,, జవ్వాది లక్ష్మయ్యగారు ప్రెసిడెంటు యూనియన్‌బోర్డు-డిస్ట్రిక్టుబోర్డు మెంబరు, పెనుగొండ.

7 ,, శ్రీమహారాజా విక్రమదేవవర్మ బహదరు మహారాజా వారు-జయపూరు సంస్థానము.

---

# రాజపోషకులు.

1 శ్రీ శ్రీ శ్రీ వీర వెంకట సత్యనారాయణస్వామివారు, ధర్మకర్త. శ్రీరాజా యి. వి. ఆర్. యస్. ప్రకాశరాయబహద్దుర్ జమీందారువారు, ఉండూరు, అన్నవరం.

2 ,, పోతాప్రగడ సూర్యనారాయణ గారు, ప్రొప్రయిటరు శ్రీసుజనరంజనీ పవర్ ప్రెస్, రాజమహేంద్రవరం.

3 శ్రీ శ్రీ శ్రీ శ్రీరాజా చింతలపాటి సూర్యనారాయణరాజుగారు, ఏటికొప్పాక.
4 ,, ముత్తా సర్వారాయుడుగారు, బ్యాంకరు, కాకినాడ.
5 ,, అణివిళ్ళ చినవెంకటశాస్త్రిగారు, కాకరపర్రు.
6 ,, ద్వారంపూడి బసివిరెడ్డిగారు, మార్టేరు
7 ,, మొసలికంటి రామారావుగారు, ల్యాండులార్డు కాకినాడ.
8 ,, తణుకు భాస్కరరావుగారు, యల్. యమ్. యస్. నేత్రవైద్యులు, ఐ స్పెషలిష్టు తణుకు.
9 ,, అణివిళ్ళ వెంకటశాస్త్రిగారు, కాకరపర్రు.
10 ,, ఆకుండి రాజారావుగారు, ల్యాండులార్డు, పిఠాపురం.

---

# పోషకులు.

---

1 శ్రీ శ్రీ శ్రీ రావుబహదురు మోతే గంగరాజు, జమీందారువారు ఏలూరు.
2 ,, సి, సన్యాసిరాజుగారు, డాక్టరు, సామర్లకోట.
3 ,, లంక రామారావుగారు, యం. బి. (హోమియో) కాకినాడ.
4 ,, కళా వెంకటా్రవుగారు, అమలాపురం.
5 ,, రావుసాహేబు కలిచిట్టి అబ్బాయినాయుడుగారు, పూళ్ల.
6 ,, తల్లాప్రగడ భాస్కరరావుగారు ల్యాండులార్డు కోనాల.
7 ,, టి. వి. రామారావుగారు, తణుకు
8 ,, రేబాల పట్టాభిరామరెడ్డి సోదరులు, జమీందార్లు నెల్లూరు.
9 ,, నడింపల్లి నరసింహారావు పంతులుగారు, గుంటూరు.
10 ,, జూపూడి కేశవరావుగారు, భీమవరం.

---

# సహాయులు.

1 శ్రీ శ్రీ శ్రీ మోతే కృష్ణారావుగారు జమీందారు, ఏలూరు.
2 ,, కొండూరి నారాయణరావుగారు, మర్చంటు ఏలూరు.
3 ,, పైడా శ్రీరామకృష్ణయ్యగారు జమీందారు కాకినాడ.
4 ,, పోలవరపు రామచంద్రరావుగారు ఏలూరు
5 ,, బసవ సూరన్నగారు అత్తిలి.
6 ,, కాసాని అప్పారావుగారు నిడదవోలు.
7 ,, తాడంకి సంజీవరావుగారు జనరల్ మర్చంటు బెజవాడ.
8 ,, కొల్లూరు మహాదేముడుగారు కరణం, కొక్కిరవల్లి.
9 ,, గొంది కేశవులుగారు ల్యాండులార్డు కొవ్వలి.
10 ,, శిష్టా వెంకటసుబ్బయ్యగారు నర్సాపురం
11 ,, వాజపేయాజుల రామసుబ్బారాయుడుగారు
12 ,, సూరిసెట్టి స్వామినాయుడుగారు మగటపల్లి.
13 ,, భూపతిరాజు సూర్యనారాయణరాజుగారు ఖండవిల్లి.
14 ,, నిమిషకవి భవానీశంకరరావుగారు యక్సైజునబ్ ఇన్స్పెక్టరు
15 ,, మామిడి సూరన్నగారు ఇనుపపెట్టెలవర్తకులు ధవిళేశ్వరం.
16 ,, యం రామకృష్ణయ్యగారు డాక్టరు నిడదవోలు.
17 ,, దమ్మలపాటి వెంకట్రావుగారు బాదంపూడి.
18 ,, టి. జీ బంగారుస్వామిసెట్టిగారు రాజమండ్రి.
19 ,, వరిమి సుబ్బారావుగారు ల్యాండులార్డు తణుకు.
20 ,, మెండు వీరన్నగారు ప్రెసిడెంటు డి॥ బోర్డు పినపళ్ళ.
21 ,, యం. దశరథరామరెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం.
22 ,, బెజవాడ వెంకటకృష్ణారెడ్డిగారు బుచ్చిపాలెం.

23 శ్రీ శ్రీ శ్రీ శ్రీ పెండ్యాల శ్రీరామచంద్ర వెంకటకృష్ణరంగారావు జమీందారువారు కొండగూడెం ఎస్టేటు దొమ్మేరు.

24 „ భారతం సూర్యనారాయణగారు ఖండవిల్లి.

25 „ రంకిరెడ్డి సత్యనారాయణమూర్తిగారు ల్యాండులార్డు వేమగిరి

26 „ కె. బాబూరావుగారు యక్సైజు సబ్ఇన్స్పెక్టరు.

27 „ ద్వారంపూడి వెంకటరెడ్డిగారు అనపర్తి.

28 „ ఉడత్తు వెంకటరమణగారు రాజమండ్రి.

29 „ మాజేటి హనుమంతరావుగారు గుంటూరు.

30 „ తుమ్మలపల్లి వీరభద్రరావుగారు పిప్పర.

31 „ మిర్యాపుర నాగేశ్వరరావుగారి కుమాళ్ళు రామకృష్ణారావుగారు ప్రయివేటు శక్రటరీ జటప్రోలు సంస్థానము కొల్లాపురం.

32 „ నండూరి రామారావుగారు నేత్రశస్త్రవైద్యులు తణుకు.

33 „ కోట్ల వెంకటసుబ్బయ్యగారు దివాన్ జటప్రోలు సంస్థానము కొల్లాపురం.

34 „ నరసింహదేవర సూర్యనారాయణ సోదరులు కంట్రాక్టర్సు వేమగిరి,

35 „ నిమ్మగడ్డ వెంకటరమణయ్యగారు ఐ. సి. ఐ, సబ్డిస్ట్రిబ్యూటరు భీమవరం.

36 „ పసుపులేటి బలరామమూర్తిగారు కోనాల,

37 „ కరుటూరి సుందరావుగారు కోనాల,

38 „ ఎ. నంజుండయ్యగారు సెక్రటరీ డిస్ట్రిక్టుబోర్డు బళ్ళారి.

39 „ తమ్మినీడి వెంకటనారాయణగారు ఆచంట.

40 „ రేబాల పెద్దసుబ్బరామిరెడ్డిగారు మోపూరు.

41 „ బెజవాడ చంద్రశేఖరరెడ్డిగారు బుచ్చిరెడ్డిపాలెం.

42 శ్రీ శ్రీ శ్రీ గారపాటి చినకనకయ్యగారు నాయుడుగూడెం,

43 ,, చిక్కా కామేశ్వరరావుగారు సబ్ అసిస్టెంటుసర్జన్ యమ్మిగనూరు.

44 ,, గుమ్మా సత్యనారాయణమూర్తి పంతులుగారు చికకోలు.

45 ,, తంగిరాల రామమూర్తిగారు } టీచర్సు ఆదోని.

46 ,, భాగవతుల వెంకటశాస్త్రిగారు }

47 ,, గాదె విశ్వనాధంగారు మార్టేరు.

48 ,, కోనాల పేర్రెడ్డిగారు మార్టేరు,

49 ,, జయంతి రామయ్యపంతులుగారు ముక్తేశ్వరం.

50 ,, సత్తి కామిరెడ్డిగారు మార్టేరు.

51 ,, కర్రి చినవెంకటరెడ్డిగారు మార్టేరు.

52 ,, జంపన సుబ్బరాజుగారు ఖండవిల్లి.

53 ,, పెనుమెత్స శీతారామరాజుగారు అజ్జరం.

54 ,, రావుసాహేబు గుత్తా వెంకయ్యచౌదరిగారు ఏలూరు.

55 ,, అక్కులంక నరసింహంపంతులుగారు ఏలూరు.

56 ,, తెన్నేటి విశ్వనాధంగారు విశాఖపట్నం.

57 ,, పూసపాటి అప్పలనరసింహరాజుగారు జొన్నలవలస.

58 ,, అప్పల జగన్నాధరావుగారు ఎలమంచిలి.

59 ,, బొమ్మిసెట్టి లక్ష్మీనరసింహస్వామిగారు నెల్లూరు.

60 ,, మంత్రిప్రగడ నరసింహంపంతులుగారు మద్రాసు.

61 ,, బొమ్మినపల్లి నరసింగరావుగారు నూజివీడు

62 ,, కాకాని వెంకటసుందరరావుగారు గుంటూరు.

63 ,, టి. వి. సుబ్రహ్మణ్యంగారు నెల్లూరు.

64 ,, చిరాత్రపూరి సూర్యప్రకాశరావుగారు బ్రూక్ బాండు టీ ఏజంటు రాజమండ్రి.

65 ‌‌‌,, ,, ,, వడకండ్ల గురురాజాచార్య విద్వాన్ ఆదోని.

66 ,, యం. వెంకయ్యగారు ఆదోని.

67 ,, కే. వేణుగోపాలరావు నాయుడు గారు తహశ్శీలుదారు ఆదోని

68 ,, యం వెంకటసుబ్బయ్యగారు పోలీసుఇన్స్పెక్టరు ఆదోని.

69 ,, పెమ్మరాజు లక్ష్మీనారాయణమూర్తిగారు బల్లిపాడు.

70 ,, రావుజీపెరిస ఆదోని.

71 ,, తోట ధనపతిరావు డాక్టరు తాడేపల్లిగూడెం.

72 ,, చేగొండి రామకోటయ్యనాయుడుగారు దొడ్డిపట్ల

73 ,, శ్రీమాన్ కొమండూరి గోపాలాచార్యులుగారు దొడ్డిపట్ల.

74 ,, కోనా వెంకటకృష్ణారావుగారు మునసబు విప్పర్రు

75 ,, హస్సేన్ పీరాసాహెబుసాహుగారు అనంతపూర్.

76 ,, కోలా రామారావుగారు కంట్రాక్టరు వైజాగ్.

77 ,, చాగంటి సాంబశివరావుగారు వైజాగ్.

78 ,, తంగిరాల వెంకటసూర్యనారాయణగారు

ఎల్. యఫ్. అసిస్టెంటు ఇంజనీరు తాడేపల్లిగూడెం.

---

# పోషకులు.

1 మ॥ రా॥ రా॥ శ్రీ॥ టి. కృష్ణమ్మగారు, డిస్ట్రిక్టుమునసిఫ్, పోలవరు.

2 ,, తేతలి చినరామిరెడ్డిగారు, విలేజిమునసబు, పెనుగొండ.

3 ,, జిడ్డు శివరాంగారు, సబ్ అసిస్టెంటు సర్జన్, భద్రాచలం.

# సహాయులు.

1 మ॥ రా॥ రా॥ శ్రీ॥ కంచిరాజు వెంకటసుబ్బారాయుడుగారు. కరణం, పెరవలి.

2 ,, పుల్లా కృష్ణమూర్తిగారు. యలమంచిలి.

3 ,, చిట్టూరి ఇంద్రయ్యగారు. మునసబు, తణుకు.

4 ,, గుడిమెట్ల సోమిరెడ్డిగారి దత్తతకుమారుడు రామిరెడ్డి గారు మల్లిపూడి.

5 ,, కొత్త వెంకటేశ్వర్లుగారు మర్చంటు మారంపల్లి,

6 శ్రీమత్ కిలాంబి శేషావతారంగారు. వకీలు, ఏలూరు.

7 మ॥ రా॥ శ్రీ॥ నూతక్కి రామశేషయ్య చౌదరీగారు, అసిస్టెంటుదివాను జయపూర్ సంస్థానము, రాయగడ

8 ,, చిట్టూరి యింద్రయ్యగారు వకీలు, ఏలూరు.

9 ,, కాసూరి కృష్ణయ్యగారు, యలమంచిలి.

10 ,, గుత్తికొండ పురుషోత్తంగారు. స్పెషల్ మేజస్ట్రేటు, పాలకొల్లు

11 ,, కె. సుబ్బారావుగారు, మునిసిపల్ ఇంజనీరు, గుంటూరు.

12 ,, ముత్తా మల్లేశ్వర సర్వారాయుడుగారు, బ్యాంకరు, కాకినాడ.

13 శ్రీమత్ కిలాంబి రంగాచార్యులుగారు మ్యునిసిపల్ కౌన్సిలర్, గుంటూరు.

# సరస్వతీ ఔషధాలయం

కాకరపర్రు — పశ్చిమ గోదావరిజిల్లా.

## 1 సిద్ధకల్పరసః—

స్త్రీలగర్భాశయ వ్యాధులకు పేరెన్నికగన్న ఔషధరాజము. స్త్రీల కుసుమవ్యాధులు, ముట్టునొప్పి, ఋతుబద్ధము - వీటిని మాన్పి రక్తవృద్ధి కలిగించుటలో నద్వితీయమైనది.

60 మాత్రలసీసా రు 1-0-0

## 2 శిశురక్షణిః—

శిశువుల జ్వరము, జలుబు, దగ్గు, అజీర్ణము, పాలు గ్రక్కుట, నీళ్ళవిరోచనములు మున్నగు పిల్లలవ్యాధులకు సంజీవి. ఇందుస్వచ్ఛమగు కస్తూరి, జున్ను, మరికొన్ని వంట ఔషధముల కూడిక చే ప్రత్యేకశ్రద్ధతో తయారుచేయబడి నది. మామూలు బజారురకముకాదు.

100 మాత్రలుసీసా రు 0-8-0

## 3 మధుమేహభంజనిః—

అతిమూత్రమును తగ్గించుటకు యీ ఔషధము మిగుల ఖ్యాతి గడించినది. మూత్రమునందు చక్కెరను

బోగొట్టి బలమునొసంగును—పెక్కు కేసులకువాడి నిదర్శ
నము చూడబడినది—60 మోతాదులు 1 నెలకు సరిపోవు
నది. వెల రు 5—0—0

## 4 రతివల్లభ గుళికలు:—

శుక్లనష్టమునుమాన్పి రక్తవృద్ధి వీర్యవృద్ధి, బలము,
తేజస్సు, యౌవనము కలిగించుటయేగాక మిక్కిలి కామో
ద్దీపనమును గలిగించును. దీనివిషయమై యింతకంటె నె
క్కుడు వ్రాయకూడదు—ఉపయోగించిన మీకే తెలియ
గలదు

30 మాత్రలు—రు 3—0—0

## 5 సరస్వతీ పైన్‌బాం:—

సమస్తనొప్పులను నివారించు అంజనములలో నీఅంజ
నము అగ్రస్థానము నలంకరించియున్నది. తలనొప్పి, పార్శ్వ
పునొప్పి, కీళ్ళనొప్పులు—కముకుదెబ్బలు, నరుకులు, పుండ్లు,
విషజంతువులకాట్లు, తామర, గజ్జి, చిడుము మున్నగు
వ్యాధుల నాశ్చర్యకరముగ పోగొట్టును.

సీసా వెల రు 0—8—0

## 6 సుఖరోగాంతకము:—

తీరని సుఖవ్యాధులను దునుమాడును - జీర్ణించిన, శగ, సవాయి, వీటిని బోగొట్టును. రక్తశుద్ధిచేయును—
నెలకు సరిపోవుమందు 60 మోతాదులు—రు 4—0—0

డాక్టరు ఎం. వి. శాస్త్రిగారి ఔషధ రత్నములు తెలుసు.

## 7 మదన మోహన ఘుటిక లు:—

ఈమాత్రలు మిగుల విలువగల ఔషధములచే తయారు కాబడినవి. పలువిధములగు నిశ్శక్తలు, శుక్ల నష్టము, మొదలగు వ్యాధులనన్నిటిని పోగొట్టి, రక్తవృద్ధిని గావించును. 30 మాత్రలుగలసీసా రు 2—0—0

## 8 అమృత పుష్పం:—

సకల చర్మవ్యాధులను పోగొట్టి, రక్తశుద్ధిని గలుగ జేయును. వెల తులం 1 కి రు 2—0—0

## 9 అజీర్ణ మాతంగ సింహస్వప్నం:—

ఎట్టి కఠిన అజీర్ణవ్యాధిఅయినను పోగొట్టి జీర్ణకోశ మును శుభ్రపరచి బలము నొసంగును.

ఔన్సుసీసా రు 0—6—0

ఈపై మందులుకూడ బడయగలరు.

# తొలిపలుకు.

---

విక్టర్ హ్యూగో మహాశయుని 'హంచ్ బాక్ ఆఫ్ నోటర్ డామ్' అనునది యీకథకు మాతృకము. ఇది అనువాదము మాత్రము కాదు. చాలవరకు కథనడకలోను పాత్రలలోను మాతృకననుసరించితిని కాని కొన్ని మార్పులనివార్యమని వాటిని కూర్చితిని. అనువాదము బహు త్రోవలు ద్రొక్కినవి. రంగమును, పాత్రలను దేశీయముల జేసి మన ఆచార వ్యవహారములకు గిట్టని వాటినికూడ తొలగింపకయే ననువదించుట యొక్కఫక్కి. అందు ఔచిత్యము లేదు. మార్పు వీలు లేదనిన అసలు రంగము నామముల నుంచి వేసిన తప్పేమియు లేదు. తప్పు లేకుండుటయే కాదు అట్లు చేసిన సంఘమున కుపకార మొనర్చుట యగును.

మన సాంప్రదాయము విషాదాంతము నంగీకరింపదని నావిశ్వాసము. మన మనస్సుకూడా విషాదాంతమును సహింపలేదనికూడ నానమ్మకము. అది కాకున్న నాకు మాతృకలోని విషాదాంతము విచారమును కలిగించినది. ఒకనాడు మాసోదరుని పిల్లలకు అసలు కథ జెప్పుచు నే నెన్నియో చర్చలకు లోనైతిని దానిఫలితమీ కథ. దీని వ్రాయుటకు ముందుకొన్ని సంవత్సరములకు పూర్వము

అసలు కథను చదివియుంటిని. ఆకథలోని యున్నత భావములు కథనడక హత్తుకునియుండుటచే నాజ్ఞాపకము ననుసరించియే నీకథ వ్రాయగడంగితిని. అందువల్ల కొన్నిలోపములుకూడ నీగ్రంథమున నుండవచ్చును. అవిగాక బుద్ధిపూర్వకముగ నుంచిన మార్పులున్నవి. మాతృకను మరుగుబరచి కథ యంతేయు నాయల్లికయే ననుట వంచన. అందుకు బూను కొనుట సాహసము. అయినను మార్పులనుగూర్చి హ్యూగోమహాశయుని మహోన్నత భావములను మన సాంప్రదాయాను సరణముగ మనవారి కెరుక బరచుట నా ఉద్దేశ్యము.

ముఖ్యమార్పు ఈకథ విషాదాంతము కాకుండుట. అందుకు అనువగునట్లు మార్పులుకొన్ని. సాధువు సహజశక్తి సంపన్నుడు; సాధనశక్తియుతుడు. కృణీకమగు నీర్ష్యకులోనైనను తన యుత్తమగుణమును వెల్లడించి యొక యనాథకు రాలిని రాజదండననుండి రక్షించినాడు. పాశ్చాత్యులలో మత ప్రబోధకులు మతగురువులు వివాహము లొనర్చుకొనుట సమ్మతము. వారిలో ప్రేమ ఇతర ప్రాపంచిక రాగరసములు చెలరేగుట అరిదికాదు అసలు కథలో బిషప్ విషాదాంతమునకు కారణము. హ్యూగోపండితుడు 'హాంబ్ బేక్' యొక్క నిగూఢమగు ప్రేమను వెల్లడించుటలో విషాదాంతమును జూపెను. మన దేశమున గూడ

మతగురువు లుద్రేకతలో దుడుకు పనులొనర్చువారు లేరని కాదు. కాని నీతిబోధకమగు కథలో సహజశక్తులు పునరుద్ధరించుట యొక మేలు. పశ్చాత్తాపము పలువిధపాపములను ఛేదించును; చదువు వారికి ఖేదమునేగాక నీతినిబోధించుట కుపయుక్తమగును. రోజాబీ యొక రాజహంసవంటిది. ఆమె యేల చావవలయును? ఆమె కితరశిక్ష మాత్ర మేల కలుగ వలయును? ఆమెకు శిక్షకలిగిన కథానాయకునిలో మార్పు కలుగునా? గుణపాఠము కాలయును.

పిచ్చిది రోజాబీయొక్క నిజమాతయని చదువరులకు తెలియును. నాకథ కెంతగ యవసరమని తోచినదో నంతగ నామె కథ వ్రాసితిని. విషయము, సహజబంధువులను వీడినను వ్యక్తిప్రేమచే వృద్ధిగాంచును. ప్రేమ సహజబాధువులకు విషాదకారణ మగుటకలదు. ఆవ్యక్తి లక్షణములపై దానిపరిణామము మరియొకటి యొకేవ్యక్తి యనేకుల ప్రేమను గొందరికుగుట.

అనేకు లొకే వ్యక్తిని ప్రేమించినను వారి వారి ప్రేమ పలువిధములుగ వ్యక్తమగును, పరిణమించును. ఆవ్యక్తి పవిత్రప్రేమకు పాత్రురాలు కావలెను. అట్టి వ్యక్తి శిక్షనందుట మనము సహింపగలమా? ఆమెకు గళంక మాపాదించి యూరకుండుటలో నౌచిత్యమున్నదా! ఆమె నిష్కళంక జీవనము నామె గుర్తించుటతో సరిపోవునా?

తుదిమాట. ఈకథముగించుటలో కొన్ని మార్పులు హితులు సూచించిరి. కాని నాకు మనస్కరించలేదు. రోజాబీని నిజసంఘమునకు చేర్చి సంఘసేవినిగా చేయుట ప్రశస్తమని యొక సూచన. ఈనాటి కథలన్నిటిలోనట్టివి యతుకుట అలవాటయినది. కాని యందలి కథ కది యతుకదు. రోజాబీ స్వభావము అట్టిమార్పును దాపీయదు. రోజాబీ పాలక తండ్రిమాట మరువరాదు. తక్కినసూచనలనుగురించి వ్రాయుట అవుసరములేదు. కథలోని ప్రధానస్యభావములు వాటిపోషణయు కర్తవ్యములు, కాని ప్రతి కథ ప్రస్తుత రుచులననుసరించుటలో ఘనత లేదు.

గుంటూరు శ్రీహరి, బి. ఏ.
గ్రంథకర్త.

# ప్రేమ ఫలితము.

అనకాపల్లి యొకపట్టణము. శారదానదీతీరమున నుండిన నా పట్టణము సకల సంపన్నిలయమనుట నతిశయోక్తి కానేరదు. పురసౌందర్య మంతగ లేకున్నను నగరజీవన మెట్టిదో నందుల వ్యామోహ మెట్టిదో నగరజీవితాభిలాష వృద్ధియగుచుండుటకు గారణము లెవ్వియో నందు గన్పట్టును. కుక్షికై మానవు డెన్నిపథములు ద్రొక్కవలెనో, సుఖప్రాప్తి కెన్నితిరుగుడులు దిరుగుమనో, విలాసపరిణామ మెట్టిదో, మానవబుద్ధిచాతుర్య మెంతటిదో వాయుసమాన మగు గొప్పకై యెట్టిపెనుగులాటలుండునో నవన్నియు నా పట్టణమున నొకదినము వాసమొనర్చినవానికిగూడ సుబోధితము జేయునట్టి పరిస్థితు లందున్నవి. కావున వైశాల్యమున జిన్నదయ్యు నా పట్టణము మహానగరరాజముల యౌన్నత్యము నందియున్నది.

ఆ పట్టణమునకు శోభగూర్చునవి పురోపరి ప్రదేశములు. పచ్చని పైరుపంటలతోటి పంటభూములును సకల కాలములందు జిగురుటాకు పూఫల సహితమగు వృక్షజాల

యుత వనప్రదేశములును బట్టణప్రజల కానందజనితము లగు టయేగాక నార్థికవిషమ సమస్యాభేదకములునై యుండును.

ఆ పట్టణమున నొక యారామ మధ్యమున నొక సంపన్నషాహుకారొక దివ్యభవనమును గట్టించెను. ఆ భవనమున నా షాహుకారుగాని యతని కుటుంబీకులుగాని వసించుట లేదు. అది గొప్పయుద్యోగస్థు లెవరికైన బసగ నప్పుడప్పుడు నుపయోగబడుట గలదు. వత్సరమున కొకటిరెండు సారులుమాత్ర మా వణిగ్శిఖామణి కుటుంబీకులలో నెవరయిన నా భవనమున గొన్నిపూటలు విరామ మొనర్పుట లేకపోలేదు. పట్టణసందర్శనాభిలాషులు గొప్పవారైన నా భవనమున విడియుచుండుటకూడ గలదు. ఇంతకన్న నా భవన మన్యవిధముగ నుపయోగింపబడుట లేదు. అది పట్టణమునకు దూరమున లేదు. అదియున్న ప్రదేశమునకు రెండువైపుల రోడ్లును నొకవైపున నితరుల యిండ్లును నాల్గవప్రక్క సాగు భూములును గలవు. పట్టణములో జేరినదయ్యు నది విలాస భవనముగ బూజింపబడుచు దోటమాలి యధీనమున నుండును. భవనము మధ్యనున్నది. దానిచుట్టును పలువిధములగు పూలమొక్కలు క్రోటనుమొక్కలు నాటబడి యుండెను. లతాలితక లందందు నిపుణతగ బెంచపడుచుండెను. ఆ ప్రదేశమునకు చుట్టును వివిధఫల వృక్షములుండెను. అవియు దాటినతరువాత నొకరోడ్డునంటి యొక చక్కనిబీటు

ప్రదేశమున రెండవరోడ్డువాని శకటశాలలును గలవు. తోటమాలి యిల్లా యారామమున కొకమూలగ నుండెను.

బీటుప్రదేశము దేశమున మూకలుగదిరుగు భిక్షులకు విడిదిస్థలముగను శకటసాలలో నొకటి సాధువులకు బైరాగులకు వసతిగృహముగను నుపయోగ పడుచుండెను. అందులకు యజమానిగాని తోటమాలిగాని యెట్టి యాటంకము జేయుటలేదు.

మన కథాకాలమునాటికి సాధువు లుపయోగించు శకటసాలయందు గతిపయదినములనుండి యొకసాధువు నివసించుచుండెను. ఆ సాధువు ఉదయమగుసరికి స్నానాదులను ముగించి సాలయందువెలగు వైశ్వానరుని సమీపమున సిద్ధాసనము వైచికొని యోగసాధనా నిమగ్నుడగును. పట్టణవాసులు కొందరు నిత్యము సాధుదర్శనము జేసికొని యతనిభక్తికి వలయు ఫలక్షీరాదులనా సాలయందుంచి పోవుచుందురు. సాధువునకున్న సామగ్రి రెండుమూడు కౌపీనములు, మృగచర్మమొకటి, దండ కమండలములు, రుద్రాక్షమాల, ఒకసంచి, పాదరక్షలు. సాధు వాజానబాహువు; అతని మేనిచాయ చామనచాయ; శరీరము పొడవుగనుండి నిరంతర యోగసాధన ఫలితముగ బలిష్టమై యుండెను; దీర్ఘనాసికః తేజఃపుంజములగు నక్షిద్వయము, తీరగు చిబుగడ్డము పెదవులనుండి వెల్లువెలయు చిఱునగవు చక్కని

జటాజూటము సాధువుయొక్క సౌందర్యమును శాంతిభావ మును జాటుచుండెను.

చిలుముగొట్టమొకటి సాధువు సమీపమున లేకపో లేదు. కాని యది యతనిచే నుపయోగింపబడుట జాల తక్కువ.

సాధువు మితభాషి. ఎందరెందరో వచ్చిపోవుచున్నను వారితో నతడు మాటాడుట గన్పట్టదు. రోగచికిత్స కైవ చ్చెనవచ్చిన నారాయణ శబ్దోచ్చారణతో వారికింత బూడిద మంత్రించి యిచ్చువాడు. భక్తిమెయివచ్చు వారాతని సం దర్శనసుఖలోలురై వెడలువారు. ఏదినమయిన నాసాధువున కుద్బోధభావము వికసించిన నా దినమందాతడు సప్రమాణ ముగ వేదాంత ముపదేశించుట గలదు. ఆతడొచ్చినది మొదలు పట్టణములో నత డడుగిడ లేదు. వేడుకయనితోచిన నతడాసాలనుండి వనప్రదేశమునకరగి యందు విహరించుచు బ్రకృతి లావణ్యాతకు మురియుచుండువాడు. అతను సామా న్యుడుకాడు. జ్ఞాని, సిద్ధుడు, ఆ గుణము లతనియందు వ్యక్త మగుచుండెను.

తోటమాలి రామయ్యకాసాధువుయందు గురుభా షము కలుగుటచే సాధువు విహారమున కతడెట్టి యాటం కము గలుగజేయకుండుటయేగాక నతని యగ్నిహోత్రము నకు జిదుకలుగూర్చుట పూజకని తులసిదళములను బువ్వ

ములను సాధువు సమీపమున నుంచుట జరిగించువాడు. ప్రతియుదయమున దినరాజురాకకై సంతసించు కుసుమ జాతులనుండి మంచిపుష్పములనెంచి రామయ్య సాధువున కర్పించువాడు. సాధువు నారాయణార్పితముగ వాటిని గ్రహించి యాకుసుమయాకార పరిమళాదులజూచి యాఘ్రాణించి యానందించువాడు. వాటిసారమును గ్రహించు నపుడు నిమీలత నయనములతో సాధువు ధ్యాన నిమగ్నుడగుటకూడ గలదు.

సాధువా సాలలో బసచేసినదిమొదలు భవన పరిసరముల మనుజుల రాకపోకలు హెచ్చాయెను. పూర్వము బాటసారులును ప్రక్కయిండ్లవారును దమతమ కార్యములందుండి యా యారామముతో నెట్టిసాంగత్యము గలుగజేసికొనకుండుటచే వారివలన నా యారామమున కెట్టిలాభమును లేకపోయెడిది. ఇప్పుడు సాధువువలన వేదాంతమును భక్తిని గ్రహించుటకనియో నూతనవ్యక్తిని జూచుటకనియో చిలుమునకనియో సాధువు సదుపాయముల నరయుటకనియో నెవరోవచ్చుచు బోవుచుండెను. వారిలో ముచ్చటకల్గినవారో కాలము కలసివచ్చునని విహారమున కుపక్రమించువారో భవనమును దోటను సంచరించుచుండిరి. సాలలున్ననెవ్వున నిపుడునిర్మానుష్యముగ నుండుటలేదు. తోటలోగూడ జనసంచలన ముండసాగెను.

ఒకనాటి సాయంకాలమున నాయారాము మందలి బీటుప్రదేశమునకు రోహిలాదం డొకటి వచ్చియుండెను. ముప్పదిమంది పిన్నపెద్దలు గుఱ్ఱములపైనుండి సామానులను దింపుచు దింపిన సామగ్రినుండి గుడారముల నెలకొల్పి వాటి నందందు నిలుపుచు, విలాసముగ వినోదముగ సంభాషించుచు బ్రయాణకష్టమున కుపశాంతి జేకూర్చుకొనుచుండిరి. రాత్రియగుసరికి వారి గుడారములు లేచెను. అందు మిగిలిన సామగ్రి చేర్చబడెను. శ్రమబడలికను దీర్చుకొనుటకు చాల మంది పచ్చికబయట సుఖోపవిష్టులయిరి. గుఱ్ఱములు మేతకై వదిలివేయబడెను. కాని స్త్రీలకుమాత్రము విరామము లేదు. వారు వంటచెఱకుకై నా పరిసరముల దిరుగ నారంభించిరి. రామయ్య వారాబీటియందు దిగుట కాటంకము బెట్టుచున్నను తోటప్రదేశములోనికి కాలిడకుండ గట్టుదిట్టముల జేయుచుండెను. పిల్లలష్టమచంద్రుని చంద్రికాంతు లనుభవించుచు నూతనప్రదేశమను శంకాభావములు మదిం జొరనీయక బాల్యక్రీడలందు నిమగ్నులై యుండిరి.

ఇంతలో రక్షకభటు లిరువురు దీపములతో నటకు వచ్చి యందు గూర్చునియున్న పురుషులను బ్రశ్న పరంపరలచే విసిగింప మొదలిడిరి. ఆ గుంపునాయకుడగు రహింతుల్లా రక్షకభటుల కుచితసమాధానముల నిచ్చుచుండెను. అతనిజవాబులందు నిర్లక్ష్యము, స్వాతంత్ర్యత, హేళన

గోచరించుచుండెను. రక్షకభటులా లక్షణములను గుర్తించిరో లేదో తెలియదు. వారుకూడ కొన్నిజవాబులకు నవ్వుచు "ఆడవాళ్లందరొచ్చారు. అందరినీ పిలిపించు. రాత్రిలంను ఎవరూ ఈ ప్రదేశం దాటియుండుట కనబడ కూడదు." అనియు "వెళ్ళబ్బా. ఆ ఆడవాళ్ళను తోలి తీసికురా" అనియు నాజ్ఞల నిచ్చుచుండిరి. ఇంతలో నొక్క రొకఝగ సందిట జితువులనెత్తికొని స్త్రీలు దను గుడారము లను జేరిరి. రక్షకభటులు స్త్రీలనుగూడ లెక్కించి వారి పరి యావకములకు నవ్వుకొనుచు వెడలిపోయిరి. మరు నిముష మున కావాటికయందగ్ని యనేకమూర్తులుగ వెలసెను.

ప్రభాతముతో ననకాపల్లిపట్టణము చలనపూరిత మవజొచ్చెను. పురపాలకసంఘ నౌకరులు వీధులను శుభ్ర పరచుచుండ సింట్లను దాసులును గృహిణులును శుభ్ర మొనర్చి కలయంపుజల్లి చిత్ర చిత్రములగు ముగ్గులతో శోభాయమానముగ జేయుచుండిరి. ముడిసరకులను గొని గ్రామ గ్రామములనుండి వచ్చు శకటముల సంఖ్యాకము లుగ నంగడివీధుల నలంకరించుచుండెను. దూరదేశముల నుండి ధూమశకటములద్వార దిగుమతియైన సరకులను వర్త కుల కంద జేయుటకు రైలుకళాసులు సరకు బండ్లనీడ్చుచు నాయాస ముపశమించుటకు గేకలు వేయుచుండిరి. వాటిని మించినసంఖ్యనెత్తిబరువుల వారిది. వాడుకలుదప్పిన ముప్పు

వాటిల్లునని పాలగంపల నెత్తినిడుకొని వడివడిగబోవు వనిత
లును మంచినీటికై బిందె లొయ్యారముగఁబూని మందగ
మనమున నడచు యువిదలును వీధులకొక వన్నె దెచ్చు
చుండిరి. అంగడియం దమ్మినసరకు శీఘ్రముగ నమ్ముడు
బోవదనియెంచి కొందరు విక్రీతలు పట్టణ నలువీధుల నలము
కొనుచుండిరి. పట్టణమునుండి యితర తావులకు బ్రయాణ మవు
వారును నితర తావులనుండి పట్టణమున కొచ్చువారును
బహుసందడి జేయుచుండిరి. చలనతగాంచిన జడాజడములం
దుండి వెలువడు శబ్దజాలము రేరాజునకు వందిమాగధులవలె
నుండెను. మధ్యమధ్య పురపాలక యంత్రహేతుజనిత దుర్గం
ధమును గంధవహుడు వహించి పాంధుల నాసికారంధ్రముల
నింపుచుండెను.

ఎవరికృత్యములందు వృత్తుల యందువారు పాల్గొ
నుట కాయత్తపడుచుండిరి. విశ్రాంతికాలమునకు రేయినిగూడ
చెడుగు వాటిల్లినదనియెంచి శరీరములను శుద్ధమొనర్చు
కొని కొందరు గృహములనువీడి బయట కొచ్చుచుండిరి.
ముఖప్రక్షాళనతో కొంత చెడుగు తొలగునని యెంచి యది
కావించి యిండ్లను వీడువారును, ఉదరారాధనకై కాఫీ
గృహముల కరగు పరమభక్తులును, బడి వేళమించిన ముప్పు
వాటిల్లునని వడిగబోవు నుపాధ్యాయులును, బాలురును, లేది
నమున కుత్సాహమును గూర్చుచుండిరి.

క్షణికమగు. నీజీవధారణకై నెన్ని వస్తువు లాధా రములో యను నాశ్చర్యమును గలిగించునటు లంగడులు దెరువబడుచు నందలి వస్తువు లాయాస్థానములం దమర్ప బడు చుండెను.

పేదరికమున గలిగిన కృశీయాంగములచే జూపరులకు జాలి బుట్టింపుచుండ భిక్షుకులు నానామూలలనుండి వేయు చున్న నరవులు హృదయ భేద్యములగుట కాశ్చర్యము లేదు. వారికేకలు కర్కశ హృదయమునుండి గూడ దయా రసము స్రవించునట్లు జేయుచుండెను.

నియమమందరి కొక్కరీతిగ నుండదనునట్లు లోని కేదియు గొనకయే గొందరు కార్యములందు నిమగ్నులగు చుండ గొందరు కాఫీగృహములనుండి త్రేన్చుచు వీథుల లోనికి వచ్చుచుండిరి. మరికొందర రన్యవిధముల నాత్మా రాము నుపాసించి యుదరములు నిమురుకొనుచుండిరి. అన్నమో రామచంద్రాయని భిక్షుకుల యరవులప్పుడే మిన్ను ముట్టుచుండెను. జంతుజాలములుకూడ పొట్టయాత నలో దవ్వుల్కొని యదనుకై పరికించుచుండెను. భక్ష్యము లను గొనిపోవువా రేమరపాటునుండిన నాభక్ష్యము లను నెగదన్నుకొని పోవుటకై కాకగృధ్రము లాకసమున దిరుగాడుచుండెను శునకములసందడి జెప్పనలవికాదు.

మానవజీవితము బుద్బుదప్రాయము. సంఘమున సుఖదుఃఖ వికాసములు పరస్పరాను బంధములైయుండుననుటకు

నటుల నొకటి రెండు శవములు దహనసంస్కారమునకై గొనిపోబడుచుండెను.

క్రమముగ దుకాణములందు బేరములు ప్రారంభ మయ్యెను. మాయనుమరపించు వర్తకుల వేషభాషలును, చెమటనూడ్చి పండించిన నరకుకిడిన మూల్యము దగ్గింప నిచ్చలేక గూరకాయలవారుచేయు ఛీంకారములును అంగడి కొచ్చువారి కానందమును గూర్చుటయే పరమావధి యని యెంచి పెట్టబడినట్లు బెట్టబడిన గ్రామాఫోనుల యప్రస్తుత పాటలును వినోదమును గూర్చుచుండెను.

అట్టితరి యిరువురు రోహిలా యువతులు పెద్దయం గడి వీధిని సమీపించిరి. అందొక నివాసగృహ బహిద్వా రమును వారు జేరి గానాభినయములతో నృత్యముజేయ మొదలిడిరి. అయిల్లొక వణిక్పుంగవునిది. ఆసమయమున నాయింటి యజమాని యచట లేడు. గృహమందలి స్త్రీలు గృహకృత్యములందు దవులొ్కని యుండుటను బిల్లలు మాత్రము రోహిలా యువతుల నృత్యమును జూచుచుండిరి. వారు నడవలోని ద్వారమునుదాటి వచ్చుటకు సాహసిం చుటలేదు. రోహిలా లనిన పిన్నలకు బెద్దలకు నీనరికొక విధమగు భయము. అందుచే బిల్లలు వెలుపలి కొచ్చుట కెట్లు సాహసింతురు? లోపలినుండి "పొమ్మనండి యజమాని లేరనిచెప్పి పొమ్మనండ"ని పలుకులా పిల్లలు వినుచుండిరి. కాని రోహిలాలను బొమ్మని చెప్పలేకుండిరి. రోహిలా

యువతులు లోపలినుండి వెలువడు మాటలను వినియు నాతావు వీడుటలేదు. తమ నృత్యమును మానలేదు. వీధిలో వారిచుట్టును • పలువురు పోగయిరి. ప్రేక్షకులసంఖ్య హెచ్చుచునే యుండెను. అంతనొక తుంటరి యువకు డాయంగనలను సమీపించి "ఏమైనా నరుకులున్నా యీ అమ్మడానికి"ని వారిని ప్రశ్నించెను. ఆప్రశ్న కాయిరువు రిలో నొకతె "ఆ అమ్మే తాం. చూచినతరువాత కొనకపోతే వదలిపెట్టమ"ని మారు పలికెను. ఆయువకున కంతటితో సంతుష్టి కలుగలేదు అతడు వారికి మరియు జేరువుగబోయి "ఏవీ? తాళము లున్నవా?" అని యడుగుచు నొక యామెను దాకెను. ఆతాకుడునకు దోకతొక్కిన కాల భుజంగమువలె నాయువతి శరీరమును నిగిడ్చి మొలనున్న గుప్తకైజాకునుదీసి "ఏంచేశావు? అంగడిలోని కూరగాయ ననుకున్నావా తాకుటకు? ఇదిగో దీనినికొనుమ"ని యత నికి జూప నాయువకుడు మెల్లగ జారిపోయెను. కొందరా దృశ్యమునకు కరతాళములు జేసిరి. ఆయువతి "ఏమన్మా! చాలదూరదేశంనుంచి వచ్చాం. ఒక్కపైసా వడవేయండ"ని వేడికొన నామె పై సాహసమునకు భీతిజెంది జూగొనినలోని పిల్లలలో నొక బాలిక యామెకొక కాసీని వినరెను. పై ప్రేక్షకులుగూడ నెవరికి దోచిన రీతిని వారిని సత్కరించు చుండిరి. ఆయువతు లంతటితో సంతుష్టినొందక ప్రేక్షకు లను సమీపించి చిఱునగవుల పరిచయభాషణముల రంజింప

జేయుచు వారివలన ధనము గ్రహించుచు మరియొక గృహము నకు మరలిరి.

అరోహిలా యువతుల నృత్యగానము అందలి విశేషత కన్న నొకయామె సౌందర్యము ప్రేక్షకుల కౌతూహలము నకు గారణ మగుచుండెను. ఆసౌందర్యవతిపేరు రోజాబీ. రోజాబీ షోడశవర్షప్రాయి. షోడశకళాప్రపూర్ణ. ఆమె ముఖాబ్జమందలి సోయగమద్వితీయము. తీరగుపల్వరుస నుండి వెలువడు ధవళకాంతులామె సుందరివదనమునకు వన్నె గూర్చుచుండెను; నీలకుంతలములు సగమల్లిన రెండు జడలుగ నామె మోకాళ్ళనంటుచుండెను. చెవులకు మాత్రము బంగరు రింగులు వ్రేలాడుచుండెను. కుడిచేతి యనామికమున నొక యంగుళీయకమున్నది. బండాభరణము లేవియు నామెకులేవు. సహజసౌందర్యముదప్ప. రెండవది ఆషాబీ. ఆమె మేనిచాయ చామనచాయ. రోజాబీకన్న పిన్నవయస్కురాలు. రోజాబీవంటి యంగసౌష్టవము నామె పొందియుండలేదు. కాని యామె జాతిసౌందర్యమును గలిగి యుండలేదనుటకు వీలులేదు.

రోజాబీ చూపరుల నాకర్షించుట సహజము. ఆమె చూపిన సాహసమునకు కొందరామెను మరింతగ మెచ్చు కొనుచు నామె వెన్నంటియే యుండిరి.

ఆయువతు లాడుచుండిన యింటికెదురుగ నొక మేడ యున్నది. ఆమేడయందలి వీధివసారాలోని జాలుగోడ

నానుకొని నిలచి యొకపురుషుడు నిరువురుస్త్రీలా వినోద మును జూచుచుండిరి. తుంటరుల నదరించునపుడు బారి పోవు బాలురనుజూచి స్త్రీలు నవ్వుచుండిరి. రోజాబీ అభి మానమునకు పురుషుడామెను మెచ్చుకొనుటయు స్త్రీలు విస్మయము జెందుటయు జరిగెను. ఇంతనొక ముసలివానిని రోజాబీ సమీపించి సరసోక్తుల నతని యాచించునపు డాము సలివాడు చూపిన భయానందమిళిత భావమునకును నతని బోసినోటినుండి జారిన వెకగునవ్వునకును మేడమీదిస్త్రీలు నవ్వి "శ్రీరామం! బోగంవాళ్ళకన్నా అధ్వాన్నంగావున్నారు సుమా. నడిబజారులో సిగ్గుజంకులులేక ఏమిటా అభినయం" అని పలికిరి. కాని శ్రీరామం మాటాడలేదు. అతని దృష్టి రోజాబీ యందుండి మరలుటలేదు. అతని దృష్టియే యన నేల మనముకూడ నామెపై వ్రాలియుండెను. అవిమరలుట లేదు. స్త్రీలు శ్రీరామం మౌనమును గ్రహించి మరల క్రిందివినోదమును జూడమొదలిడిరి. ఆయిరువురి స్త్రీలలో నొకతె క్రీగంట జూచుచు శ్రీరామ మేకాగ్రచిత్తతతో రోజాబీ నవలోకించుట గన్పెట్టుచుండెను. కొన్నినిముషము లట్లు గడచిపోయెను. రోహిలాయువతులు మరొకయింటికి బోవుచుండిరి. మేడమీదిస్త్రీలు ప్రక్కచాపపై గూర్చొనిరి. రోజాబీముఖ మప్రయత్నముగ శ్రీరామం నిలిచియున్న మేడవైపునకు దిరిగెను. ఆమె తొలిచూపు శ్రీరామంపై బడెను. వారి చూపులు కలియుటయు రోజాబీ తలక్రిందకు

వాప్రులుటయు జరిగిన యంశము. అది యొకులకు దెలియదు. శ్రీరామం మందహాసన మొనర్చెను. రోజాబీ మరల పైకి చూడలేదు. అతడుకూడ వెనుకకుదిరిగి యొకమడతకుర్చీపై గూలబడెను.

అంత మాణిక్యం "శ్రీరామం! చిన్నవాడివి. మా కల్యాణాన్ని ఏలా యేలుకుంటావ్రా" యని ప్రశ్నించెను. కల్యాణం మాణిక్యం చీర చెరగునులాగి యామె ధోరణి నాప ప్రయత్నించెను. శ్రీరామం "భార్యనేలుకోవడం సహజంగా అందరికీవచ్చేదే. అది ప్రకృతిసైజం" అని కల్యాణం ప్రశ్న కుత్తరమిచ్చెను. మాణిక్యం అంతకు పూర్వము శ్రీరామమును గ్రీకంటజూచినయువిద. ఆమె"ఏమో! ఇద్దరూ చిన్నవాళ్ళు. నీకు బహువ్యాపకాల"ని సాభిప్రాయముగ మరల బలికెను.

శ్రీరామం "కళ్యాణంవంటి యువతి యౌవనవతి దొరకిన తరువాత గురువుగాస్తి మాతాపితరులునాస్తి ప్రపంచమేనాస్తి యన్నట్లు ఏలుకుంటాన"ని మాణిక్యము యొక్క యభిప్రాయమును గుర్తించకయే బలికెను. రెండవ యువతి కల్యాణం. కల్యాణం శ్రీరాములు ప్రియులు. వారి వివాహము నిశ్చయమాయెను. కల్యాణం రూపములో నంతలావణ్యత లేదుకాని యామె యంగములు వికృతిలేక తీరుగ నమర్పబడి యుండుటచేతను యౌవనావిర్భూత కళా సౌష్టవము లాయంగములకు మెరగు బెట్టుచుండుటచేతను

నామోయనంగుని శరమువలె దోచుచుండెను. ఆమె శ్రీరామం ప్రత్యుత్తరమునకు ధన్యత జెందెను. శ్రీరామముపై చిన్ని దృష్టిని బ్రసరించి యతనికొక చిఱునగవున దనకృతజ్ఞతను వెల్లడించెను. మాణిక్యం తనలో అతని ప్రిగల్భాలు అకళంక ప్రేమజనితములని విశ్వసించి భ్రమించుచున్నదీ యబల. ఏమిచేయుటకు తోచదు. దీనివ్యామోహాం తగ్గదు. వీరి పెండ్లి కాక తప్పదు. తదుపరి భార్యకూడనాస్తి అని చెప్పు స్వభావం వెల్లడి అయింది! అని గొణుగుకొనెను.

## 3

సాధువున్న సాలకు మరలుదము. ఆయుదయము సాధువు యథారీతిగ గాలకృత్యములను దీర్చుకొని స్నాన మాడి యగ్నిహోత్రమునకు జేరువుగ మృగాసనముపై గూర్చునియుండెను. యథారీతిగ నతని భక్తులు దుగ్ధఫలాదు లను దెచ్చి యతని కనతి దూరమునసుంచి నమస్కృతు లొనర్చి వెడలి పోవుచుండిరి. రామయ్య యింకను దర్శ నమునకు రాలేదు; నిత్యకానుకల నర్పించలేదు. సాధువు కూడ స్థిరచిత్తుడై యున్నటుల దోచుటలేదు. అతడు రామ య్యను "రాం" అని పిలుచుచుండును. నాడు 'రాం' 'రాం' అని రామయ్యకై సాధువు కేకలిడెను. కాని యెవరును రాలేదు. ఆపిలుపువిన్న శిష్యులు సాధువు రాముని ధ్యానించు

చున్నట్లు భావించి యూరకుండిరి. నిజముగ నాపిలుపు రామయ్యకు వినబడలేదు. సాధువు శరీరమును నిక్కించి యాసనమును సవరించెను; అగ్నిహోత్రమునుండి పొగరా కుండ నగ్నిని జ్వలింపజేసెను; ఉచ్ఛ్వాస నిశ్వాసములను దీర్ఘముగ దీయ నారంభించెను; కొన్ని నిముషములట్లు జేసి కుంభక మొనర్చి యా యానందమున దన్మయుడాయెను. అప్పటి కెనిమిది గంటలు దాటెను.

సాధువు మెల్లగ నయనములను దెఱచెను. అతడు మెల్లగ చిలుముగొట్టము నందుకొని దానియందుంచవలసిన వస్తువులనుంచి యగ్నిసంస్కార మొనర్చి పొగబీల్చుచుం డెను. ఆసమయమున వొచ్చిన భక్తులను గూర్చుండ సంజ్ఞ జేయ వారు గూర్చొనిరి. అంత సాధువు వారికి చిలుము గొట్టము నందించి వారందించిన తరువాత దానిని తాను గ్రహించి యానందించు చుండెను. అతని కానాడు మౌనము వీడినది. సాధువు భక్తి వేదాంతోపన్యాసములను బ్రారంభిం చెను. గంజాయిసేవ నాకారణముగ భక్తుల వాగ్జాలము కూడ బోరుగ సాగ మొదలిడెను. వానిగోష్ఠి కొంతకాలము జరిగెను. సాధువు మధ్యమధ్య రామయ్యకొరకై నిరీ క్షించు చుండుట జూపులలో దెలియుచుండెను. ఒక్కరొక రుగ భక్తులా సాలను వీడిరి.

సాధువు ఆలోచనా సాగరమున మునిగెను. 'వట్టి భ్రమ,' 'పొరబాటు,' 'గురు దేవా! క్షమింపుము. మనము

నిష్కళంక మొనర్చుకొనెదను,' 'అది పొసగు టెట్లు?' 'ఉన్మాదముక్షణికము' అను పంక్తులతని ముఖమునుండి యప్పటప్పట వినబడుచుండెను. ఇంతలో పదియవగంట కొట్టబడెను. రామయ్య మెల్లగ నాసాలలోనికి వచ్చి వినమ్రుడై సాధువునకు నమస్కరించెను. అతని హస్తముల బువ్వులు లేవు. రామయ్య ముఖమందశాంతి జ్యోతకమగుచుండెను. అతనినిజూచి సాధువు "రాం! పువ్వులేవీ" యని ప్రశ్నించెను. రామయ్య యాపలుకులకు దుల్లిపడి "గురుబాబయ్యా! మరచిపోయానండి. క్షమించండి. తీసికొస్తానండ"ని యచటినుండి పూదోటలోనికిబోయెను. ఎంతయో నేరము జేసినవానివగిది రామయ్య యాహార బాటునకు గుందుచుండెను.

ఎండ మిక్కుటమగుటచే నాసరికి వికసించియున్న పుష్పములు వాడ జూచుచుండెను. రామయ్య పూలమొక్కలను సమీపించి కోయుట కనువగు పుష్పములకై వెదకులాడుచుండెను. ఎదురుగనున్న పుష్పము లొక్కకమారా తని దృష్టికి గనపడుటలేదు. వాటినిదాటి యతడింకొక వైపునకు బోవువాడు. ఆకాలముల బుష్పింపని మల్లి సంపెగ చెట్లనుకూడ నతడు వెదకుట నొకవింతగ నుండెను. అతని మనమాత డొనర్చుచుండిన కార్యమున లేదనుట నది జాటుచుండెను. రామయ్య పువ్వులను గోయుచుండుటయు జరుగుచుండెను. తటాలున నెటనుండియో నొకకంజరీ చప్పుడు

వచ్చి యతని కర్ణపుటములబడ నత డచేతనుడై నిలబడి పోయెను. దృష్టి నలుదిశల సారించెను. చుట్టును దట్టముగ పెరగిన భూరుహము లతని దృష్టి నెంతయో దూరము సాగ నీయ లేదు. అంత నతడు చెవుల నటునిటు ద్రిప్పుచు నాధ్వని బీటుప్రదేశమునుండి వచ్చుచున్నటుల బోల్చి యాప్రదే శమువైపునకు బరుగిడెను. ఆప్రదేశమున రోహిలా యువ కులు కంజరీలను వాయించుచు పాడుట నతనికి గనబడెను. కాని నిరాశాపరుడై యతడు వెనుదిరిగి సాధువున్న సాలవైపు నకు సాగెను.

రామయ్య సాధువునకు పుష్పము లర్పించి నిలిచి యుండెను. అవి వాడియుండుటచే సాధువున కానందము గూర్పలేదు. సాధువు మాటాడలేదు. రామయ్య గురుదేవు తన మరపునకు గుపితుడయ్యెనని భావించి విచారించుచు "గురుబాబయ్యా! శలవు. రేపు పెందలికాడే లేచి తెస్తానండి క్షమించండ"ని దీనముగ వేడికొనెను. సాధువు "రాం! నీవు తప్పుచేయలేదు. ఏదో పనుండి ఆలశ్యమైంది. దానికి విచా రించు టెందుకు? లోపము లెవ్వరికైనా ఉంటును. సూర్యభగ వాను డారగించిన యీపవిత్రసాదసుమములు పవిత్రములు. క్షమించుట కేమియును నేరము చేసినవాడవు కావు. పోమ్ము. కాని ఒకమాట" అని యింక నేమియో పలుకబోయి సాధువు పలుకమానెను. రామయ్య కొక చింత తోలగెను. అతడు వెడలిపోవుటయు సాధువు విచారమున మునుగుటయు జరి

గెను. "ఛీ! ఎట్టి ఆలోచనలు కలుగుచున్నవి. నేడు దుర్దినము. పాడు తలంపులనుండి మనమును దిప్పుట దుస్సాధ్యముగ దోచుచున్నది. గురువుల యాజ్ఞను మీరుటయే? నానిరంతర కృషి ఫలితమిదియా? సాధనమునగూడ మనము నరికట్ట లేకుంటినే! అగ్నియందు దూకినగాని నాయీ యవస్థ తొలగ దేమో? వలదు. అందువలన మరణమైన తటస్థించును లేక శరీరము కాలిపోయి నూతనవ్యాధకు లోనవలసివచ్చును. మరణము కలిగిననే కాంక్షించు మోక్షమునకు మారు ఘోరనరకము ప్రాప్తించుట నిక్కువము. గాయముతో నాగిన నిప్పటి మనము మారకుండుటయు బాధచే గాసిలి యెందుటయు జరుగును." ఈ యాలోచనలలో సాధువు కొట్టుకొనుచుండెను.

౪

అట బట్టణములోనికి బోయిన రోహిలాలందరు వీటిని జేకుకొనిరి. అచట నంతయు కోలాహలము సాధారణ యాచకులకువలె వారికెట్టి నిరుత్సాహము గన్పట్టదు. ఆబాల వృద్ధులానందమున నుండిరి. కొందరు పాడుచుండిరి. కొంద రాయుదయ పుటాదాయమును లెక్కించుచుండిరి. కొందరు వాద్యముతో సంతుష్టి నందుచుండిరి. మరికొందరు దాగుడు మూతలాడుచుండిరి. ఆయెండలో నంతవరకు శ్రమపడియు వారట్లుండుట సోచనీయము.

ఒక రోహిలా బాలుడొక గుఱ్ఱముపై స్వారిజేయుచు గుడారములను సమీపించుచుండెను. అచట గూర్చుని యుండిన యువకులలో నొకడొక బెడ్డను దీసి యావచ్చు గుఱ్ఱమునకో యోధునకో గురిజూచి విసరెను. అది గుఱ్ఱమునకు దగులుటచే నది ముంగాళ్ళనెత్తి యాడ మొదలిడెను. పైనున్న బాలుడు క్రిందకుబడెను. ఆగుఱ్ఱమతని ద్రొక్కివేయవలసినదే గాని రోజాబీ పరుగునబోయి యాగుఱ్ఱపుమెడ నదిమిపట్టుకొనెను. "మియ్యా! ఇటురా. వీనిని లేపనెత్తి తీసుకొని వెళ్ళ"ని యామె పలికిన పలుకులకు రాయి రువ్విన యువకుడు భయమున నాబాలుని సమీపించి యతని లేవనెత్తి గాయములేవియు లేకుండుటజూచి మెల్లగ నతనిని నడిపించుకొని గుడారములను జేరెను. రోజాబీ యాంబోపుర గుఱ్ఱము నెక్కి దవుడువేయించ మొదలిడెను. గుఱ్ఱమునకు జీను లేదు కళ్ళెము లేదు. జూలును కళ్ళెముగ జేసికొని యామె యతిలాఘవమున స్వారిజేయుచుండెను. పైయెండకు దాడునకు గుఱ్ఱ మలసినంతవరకట్లు స్వారియొనర్చి రోజాబీ దానిని గుడారములవరకు నడిపించుకొనుచువచ్చి యటదిగి గుఱ్ఱపు మెడను మెల్లగ దట్టుచు "ఘోడా! పిల్లవాడెక్కడని ఆలోచించవద్దు? ఆలా తిరగతోయడం తప్పని" గుఱ్ఱమునకు బోధయొనర్చి నడలివేయనదియు రోజాబీ మాటల యర్థమును గ్రహించినటుల సకిలించి మెల్లగ మేతకై వెడలి పోయెను.

తరువాత రోజాబీ మియ్యాను బిలచి "ఖాజా చిన్న వాడు. నీవు వానితో పరియాచకము లాడతగునా? అతడు చనిపోవలసిన దే? ముందు వెనుక అరయక రాయినేల రువ్వితివ"ని యధికార యుక్తముగ బలికెను. మియ్యా భయముచే సమాధానమియ్యలేదు. రోజాబీ "జవాబు చెప్పవేమ"ని గద్దించెను. అచటి వారంద రామె యాగ్రహమునకు భయమొందిరి. మియ్యా కెట్టి దండనమామె యొనర్చునెడి యాలోచనలో హారు బడిరి. అంత మియ్యా "ఇకనట్టి పనిని చేయన"ని మెల్లగ పశ్చాత్తాపమును వెల్లడించెను. రోజా "సరె ఈనేరమును సహించితిని. ముందెన్నడు చిన్న వారిపై అత్యాచారములు చేయవద్ద"ని పలికెను. మియ్యా మున్నగువారంద రామె యుదారతకు సంతసించిరి.

రోజాబీ రహింటుల్లా పెంపుడుకూతురు. ఆమె బాల్యమునుండి యానాయకుడామె నతిగారాబముగ బెంచెను. ఆమె యాదర్శకజీవనమునకు, ఆమె యాదర్శములకు, ఉన్నతభావములకు విజ్ఞానమునకు నాదండులోని వారందరామె యాజ్ఞానువర్తనులగు చుండిరి. ఆమెను వారి చిన్నిరాణినిగ భావించి వారు యామెను సేవించువారు. ఆమెతో నాలోచించినగాని రహింటుల్లాకూడ నేపనియు జేయుటలేదు.

ఆమె మిగుల డస్సియుండుట జూచి యొకముసలిది యామెను సమీపించి, "బీగమ్! వంటయుంది భోజనానికి

లేవమ్మా. చాలగ అలసిపోయావు. లే” అని పలుకుచు నామెను లాలించి బుజ్జగించి లోనికి దీసికొని వెళ్ళెను.

ఆ వరకొక చీమచింత చాటుననుండి యీరంగమును జూచుచుండిన రామయ్య రోజాబీ గుడారములోనికి బోయిన తరువాత భవనము వైపునకుబోయెను.

౫

రాత్రి యెనిమిది గంటలయినది. పట్టణములో కొన్ని తావులుదక్క నంతయు నిశ్శబ్దముగ నుండెను. నాటకశాల యున్న తావునుంచి బ్యాండుధ్వని యానిశ్చలసమయమున పట్టణమంతయు మధురముగ వినబడుచున్నది.

రోహిలాల విడిది ప్రదేశమున దీపములు లేవు. కొందరు పిల్లలు బాల్యక్రీడలందుండిరి. పెద్దలు వలయముగ గూర్చుని యేవో ముచ్చట లాడుకొనుచుండిరి. కొందరు బ్రిక్కలనెక్కి గురుద్రిదీయుచుండిరి. అచ్చటచ్చట నాగుడారములమధ్య మంటలు చిన్నవగపడుచుండెను. మంటముగి యని వారిక్రియ యీమంటలు దెలుపుచున్నవి. ఆమంటల నుండి ధూమ మధికముగ నెగయుచున్నది.

అట్టి సమయమున రోజాబీ యొకచెట్టు సమీపమున సుఖాసీనయై యుండెను. ఆమెకించుక సమీపమున ప్రేమ వెలువరించు దృష్టితో నొకయువకుడు గూర్చుని యుండెను.

అతడు మియ్యాయని పోల్చుట కాధారమున్నది. మౌన ముద్రితులై యున్న నాయిరుపురిలో మియ్యా సంభాషణకుపక్రమించెను, "రోజా! నన్ను పూర్తిగ క్షమింపవా?" అనియతడు వేడుకొనసాగెను.

రోజాబీ, "క్షమించుట కేమున్నది గనుక? ఎదుటివారి అవస్థనెరిగి వారితో పరియాచక మాడవలెనని గుర్తెరిగిన చాలును."

మియ్యా! "అంతతోనాకు సంతుష్టి కలుగుటలేదు. అను నయపుమాటలకంటె నీహృదయం నాకివ్వవలెను. నాపై నీ కేవిషయంలో చెడ్డభావం కలుగకుండా వుండాలని ప్రయత్నంచేసినా అది కొనసాగడంలేదు. కాని ఏపనిచేసినా నేకూరభావంతో చేయలేదు. నాపై నీకట్టి సద్భావమున్నా నామనస్సునకు సంతోషమును కలిగించుము. నా మనస్సు నీకు తెలియచేసివున్నా"

రోజాబీ "నాభావములతో నీకు పనియేమి? నీమనస్సు నన్ను సంతోషపెట్టుట కుద్యమించుచున్నట్లు మాత్రము నాకుతోచినది. నన్ను సంతుష్టిపరచుటకు ప్రయత్నంచేయడానికి బదులు అల్లా సంతుష్టికై ప్రయత్న మొనర్చుట శ్రేయము."

మియ్యా, "నీభావాలతోనే వుంది నాజన్మ.నిన్ను నేను మనసార ప్రేమించాను. నాపైకృపచూపుము. నీకృప లేకుంటే నాజన్మ వ్యర్థము."

రోజాబీ, "నీవు స్వార్థము బోధించుచున్నావు. విశ్వముపై నాకనురాగం లేకపోలేదు. ఒకవ్యక్తిపై దానిని కేంద్రీకరింపచేయుట తగదు." ఈపలుకులు పలుకునపుడు రోజాబీ స్వరము కంపించెను. ఆమె మనస్సునందలి యొక భావమున కామె యొక్క పూర్వపుజ్ఞానము విరుద్ధముగ నుండినటులుండెను. కాని యాభావపరిణామమప్పా మెకు దెలియదు. మియ్యా పలుకలాభావమును దృఢీకరించుచున్నటుల నామెకు దోచెను. ఆమె జ్ఞానవికాసజనిత యుద్బోధనచే మియ్యాను వారింపనెంచెను. తనమనము నావరించుచున్న నూతనభావము నామె మియ్యాకు దెల్పలేదు. తెలుపుటకది యామెకు బూర్తిగ నర్థమవ్వనటుల గన్పట్టదు. ఆభావమే లేకున్న రోజాబీ నిశ్చలముగ తన విశ్వానురాగమును దెలుపగలిగెడిది. ఆభావమువలననే నామె కంఠము కంపించెను.

మియ్యా, "నాకు ప్రేమబిక్ష పెట్టవా?"

రోజాబీ, "అంటే."

మియ్యా "నాకుభార్యవై నాప్రేమనసఫలత చేయాలి" రోజాబీ కేదియో స్ఫురించినది. ఆమె దీర్ఘాలోచనా నిమగ్న యయ్యెను. కొంతసేపయిన తరువాత రోజాబీ, "మియ్యా! నామనస్సు నేదో కలతపెడుతూంది. నన్నూహించుకోనీ. నన్నువదలి పెట్టుము. ఏకాంతముగ నున్నగాని నాయీకలత తొలగదు" అని పలికెను. మారుపలుకుటకు మియ్యా సాహసించలేదు. అతడు తృప్తిలేని మనసుతో భారమనిపించు

చెరిడిన శరీరముతో మెల్లగ వెడలిపోయెను. తన గుడార మును జేరి "కులములోకల్లా మణిపూస. ప్రపంచిక విషయా లెరుగనిచాన. యౌవనాంకురభావము లెన్నడూ కలుగనిది. లేక వాటినిగుర్తించి యుండదు. ప్రకృతియెడల అజ్ఞానం ఉండడం అసహజం. తండ్రితో చెప్పినా ఫలంవుండదు. ఏం చేయడం? అయినా ఈరాత్రి ఆమెలో ఏదో మార్పుకలి గింది. లేకుంటే కలతకు కారణం ఏమిటి? నేనాటిన ప్రణయ బీజం మొలకెత్తవచ్చు. నాప్రార్థనలు ఆమె హృదయాలో ప్రవేశింపకతప్పదు. ఆమె కరుణామయి. ఏమో! నా పుణ్యమా అని నాఊహానిజమైతే నాజన్మ తరించున"ని యా లోచించుకొనుచు పరుండెను.

రోజాబీ హృదయము ననుసరించుట కష్టముకాదు. ఆమె ముఖదర్పణమున నంతర్భావములు ప్రతిబింబించుటలో నొక విషమసమస్య నామెను దలవనితలంపుగ నెదుర్కొనిన దనియు దానిచిక్కు విడదీయుటకు శ్రమజెందుచున్నటులను దెలుపుచున్నవి. ఆమె యాలోచన పూర్తికాలేదు. రామయ్యా యింతలో నామె కెదురుగవచ్చి "పాములుంటాయి. ఈచెట్టు నీడలో కూర్చుందాము రమ్మా" అని యామెను పలుక రించెను.

రోజాబీ కతనిరాక మొదట కష్టమనిపించెను. ఆమె యాలోచనా వాహిని కతడడ్డు దవిలెనని యనిపించెను. కాని యామె తనకోపము నుపసంహరించుకొని యానీడలో

నుంచి లేచినది. వెన్నెలలోనికి రోజాబీవచ్చి నిలచియుండ రామయ్య మరల నామెతో నేదియో మాటాడదలచియు మాటాడలేకపోయెను. ఒంటరిగానున్న నాసుందరి యతనికి వాగ్బంధనమొనర్చెను. వెన్నెల అందు నొక యపురూప లావణ్యవతి నిలిచి యొంటిమైనుండుట. అతడు మూగవై రెప్పపాటులేక నామెనుజూచుచు నిలునబడిపోయెను. ఆదృశ్యము రోజాకి నవ్వు కలుగజేసెను.

నవ్వుచు రోజాబీ "నీపేరేమిటి? రామయ్య, రామయ్య అవునుకాదూ ? పాములున్నాయన్నావు నీకుమాత్రం భయం వేయదా?'' అని ప్రశ్నించెను.

రామయ్య బహుప్రయత్నమున "ఇందులో తిరిగే వాడికి నాకేంభయమమ్మా. నువ్వు చిన్నపిల్లవి. ఈపాడు డొంకలలో తిరిగితే ఏలాగ''ని జవాబిచ్చెను.

రోజాబీ, "అడవుల్లోనుంచికూడా అవసరమైతే ప్రయాణాలు చేసేవాళ్ళకు మాకుమాత్రం భయం ఎందుకుంటుంది? చూడూ! నీకుపిల్లలున్నారా? నీలాగే వాళ్ళకి గూనివుందా" అని కొంటెగ నవ్వెను.

దీర్ఘస్వప్నమునుండి మేల్కొనిన వానివగిది రామయ్య యులికిపడి యొక్కనిట్టూర్పు విడచెను. రోజాబీ నవ్వుచు బరుగిడిపోయెను. ఆమె నవ్వతని చెవులకు వినబడుచునే యుండెను. రామయ్య తనకుటీరమునకు మరలెను. రోజాబీ

కడపటి పలుకులు, ఆమెనవ్వు వానిని రామయ్యా యన్వ యించ మొదలిడెను.

రామయ్యకు వివాహమే లేదు. అతనికి పెద్దగూన కలదు. వయసు పాతికేండ్లకంటె నధికముండదు. అతని చేతులు వక్షస్థలము తొడలు పిక్కలు కండలుబలసియుం డెను. నల్లనిమీసమతని ముఖగాంభీర్యమును సాటుచుండెను. తలవెండ్రుకల నతడు చక్కగదువ్వి తొగరబాటితో ముడి వైచెను. మెడలో నొకబిళ్ళ యెర్రనిదారమునకు వ్రేలాడు చుండెను. మొలను సీమవెండి బిళ్ళలమొలత్రాడు, చేతికి దండ. రామయ్య గూనియే లేకున్న కులమువారిలో రూప వంతుడని చెప్పకతప్పదు. రామయ్య యారాత్రి తనకుటీ రమున నులకమంచముపై బాడుకొని "పాడుదేవుడు, ఎంత అవమానం తెచ్చిపెట్టాడు." అని వాపోవసాగెను. అతని కర్ణరంధ్రముల రోజాబీ పలుకులునవ్వు ప్రతిధ్వనించుచుండె ను. అతని నోదార్చువారెవరు? అతనిమనమే. అందొక చర్చ బయలుదేరినది. మొగ్గవంటి యతనిబుద్ధి యాచర్చకాగ లేకుండెను. కొన్నిఘడియలు గతించిసపిమ్మట రామయ్య మంచముపైనుండి లేచి కుటీరమును విడచి యారామములో దిరుగాడ నారంభించెను. పూలమొక్కలను సమీపించు సరికాతనికి సాధువు జ్ఞప్తికివచ్చెను. దానివెంట నాటియుద యమున సాధువునకు బువ్వాల నీయకుండుటగూడ స్ఫురణ కొచ్చెను. సాధువు తన తప్పిదమునకు గుపితుడైయుండునని

యొడి భావమతనికి మరలగలిగెను. రామయ్య సాధువున్నదు సాలకుబోయిజూడ నంమ సాధువులేడు అతడు వెడలిపోయి యుండునని నెడిశంక రామయ్యకు గలిగెను. ఉదయమాదిగ సాలయందుండిన క్షీరఫలాదు లట్లనేయుండెను. అందెద్దానిని కూడ సాధువు గ్రహించలేదు. మున్నెందరో సాధువు లాసాలయందు బసజేసి వెడలిపోయిరి. దానిని రామయ్య చూచుచుండెడివాడు. వాని కందువలన నెట్టిక్లేశమును గలుగలేదు. ఆనాడాసాధువు వెడలిపోయెనేమో ననియెడి భావమునకే రామయ్యకు మున్నెన్నడు గలుగని వ్యథకలిగెను. రామయ్య పిచ్చివానివలె దోటలో దిరుగనారంభించెను. కొంతసేపటికి ప్రీతమువలె సాధువొక చోబడియుండుట రామయ్య చూచెను. సాధువు వెడలిపోలేదనుహర్షము రామయ్యకుగలిగెను. కాని దానివెన్నంటియే భయము కూడ కలిగెను. సాహసమున నతడు సాధువును సమీపించి చూచుసరి కతడు సజీవుడై యుండుట గాంచెను. సాధువుకూడ గండ్లనుదెరచి రామయ్యనుజూచి యతడాసమయమున దిరుగాడుచుండుట కాశ్చర్యమునొందెను రామయ్య నుద్దేశించి సాధువు "రాం! నిద్రపోలేదేం" అనిప్రశ్నించెను.

రామయ్య, "నిద్రరాలేదండి మీరలాపండుకొన్నా రేమని చూచాను"

సాధువు "ఇదియొక విధమగు సమాధి" మరలనతడు మాటాడలేదు. రామయ్య వెడలిపోయెను.

రామయ్యకు శేషరాత్రియందు గూడ నిద్ర రాలేదు. రోజాబీ తనగూర్చి పరియాచకమాడినది. దానినిగూర్చి యతడాలోచించు చుండెను. రోజాబీ ప్రథమసందర్శనమున రామయ్య మనమంతయు నామెవలన నాకర్షింపబడెను. అది పాఠకులు గ్రహించియే యుందురు. అంతటినుండియు నతడామె దివ్యమూర్తిని యారాధించుచుండెను. దానినారాధించుచు నానందసుఖముల దన్మయుడగుచుండెను. ఆమె సందర్శనసుఖమబ్బని ఘడియలందతనికి జికాకువేచెడిది. పనిపాట్లయందభిరుచికూడ తగ్గసాగెను. కాని తన పదవియేమి? రోజాబీ తనకంటె నీచవృత్తియందున్న దనియెడి దతనికి దట్టలేదు. రోజాబీవంటి సుందరికి ప్రాపంచిక పదవితో బనియేమి? ఆమె స్థానమామెను జూచినవారి హృదయము లందు ఆహ్లాదమోపాధకులలో నశ్వరకముల వారుండిరి. వారి హృత్సారము కామె రాయంచ. రామయ్య హృదయమునందు గూడ నామె విహరించు చుండెను. రామయ్య యారాయంచ సొబగునకు ముగ్ధుడాయెను. ఆమె నతడు ప్రేమించెను. కాని తనప్రేమ నెవరికెరిగింప గలడు? తన యంగవికృతి తనకు దెలియనిదికాదు. వృత్తి కూలి. ఏమని యామెకు తనమనస్సెరిగించగలడు? ఏకారణమునసైననేమి యతని మనమంతయు రోజాబీతో నిండిపోయినను రామయ్యయందు అంధయుద్రేకము పుట్టలేదు. అతని మన మొరులకెరిగింప నిశ్చయించలేదు. ఏవస్తువు నతడు మన

సార ప్రేమించెనో నామె నిజముగ యందవతి. అతనిజీవిత మందదియే నతనివలపు. రోజాబీ సందర్శన సుఖముతో నప్పటివరకతడు తృప్తినందు చుండెను. నాడురోజాబీనియతడు జేరి యామెతో సంభాషించుట నతడు మరువజాలడు. ఆమె ప్రత్యుత్తరమిచ్చుట మరింత సుఖదాయకము. కాని యామెస్వోక్తి గూనెగాక నొండొకదాని విషయమైనచో రామయ్యకు వ్యథలేకుండెడిది. ఆమె తనయంగ వికృతిఁ గాంచి యాడినమాట లతనిని గుచ్చెను. "ఎందుకీతనువు! ఇందుకనే నాయీ ఊడిగవృత్తి నాకు గలిగినది. ప్రపంచమునకు దూరమైతిని. నారూపంచూచి ఏవగించుకుంటారు. నాహృదయంచూచే దాతయేడీ" ఇవియతని యాలోచనలలో కొన్ని—

౬

శ్రీరామమొక వైశ్యయువకుడు, రూపసి. రూపమునకుదోడు నవనాగరికతాలూకు నాజూకతనిలో మూర్తీభవించి యుండెను. కులమువారిలో నతడొక వింతమానసిగ దోచుచుండెను. చేతికి బంగరు గొలుసుచే గట్టబడిన మేలు బంగారపుగడియారము; కండ్లకమర్చు కండ్లజోడు నాగరకలక్షణములు ధరించు వస్త్రములు మాత్రము వలుచని ఖాదీవస్త్రములు ఉంగరములకాత్రిపిం గతనినొక సొంపును గూర్చు చుండును.

శ్రీరామం స్కూల్ ఫయినల్ పరీక్షయందు దప్పి విద్యకు స్వస్తిజెప్పెను. అంతవరకు నాంగ్లవిద్య నందిన యువకునకు గులవృత్తియం దభిరుచి తగ్గుట సహజము. యౌవనము, ఉత్సాహము ఇవి యతనిసోమరిని జేయలేదు. దేశీయోద్యమములం దతడు ముందంజవేయు చుండెను. ఉద్యమమందలి యుత్సాహము సడలినతరువాత నొక షాపును దెరచెను. అత నీవ్యాపారమునం దెన్నియో పరిశోధనలు గావించుచుండెను. అతని మనమే యొక్కయుద్యమమునందు నిలుకడ గలిగియుండుటలేదు. స్వలాభమునకై పాటుబడుటకన్న దేశోపకారమునకై జీవితమును వెళ్ళబుచ్చుట యుక్తధర్మముకాదా! ఒకముద్రానాలయమును స్థాపించుట కత డుద్యమించెను. అతని వాచాలతకు లోబడి యతని యుద్యమములకెవ్వరు నాటంకము జేయువాఁడుకారు కాని యతని మనము భావియాంధ్రోళనకొక నిలయము. ఎన్నియోకోరికలు, వాటిని కొనసాగించు సాధనములునున్న, వాటినన్నిటినా మోదించువారుతక్కువ, నూతనోద్యమములు చెలరేగుట, వాటినిగూడపైని వైచుకొని మరునిమిషము నుండి కాలమునకై వగచుట. కార్యభారమునకు దుఃఖంచుట నిట్టివి సామాన్యమాయెను. అతనికిగూడ నీసంకటము లమలులలో నుండెను. చేయుటకు సంకల్పించిన కార్యములు కొన్ని గొప్పకై నితరులు జూపినపైని వేసుకొనినవి కొన్ని. కార్యభారము మెండు శ్రీరామం మాటలలో నెట్టిలోపమును వెలిబుచ్చడు. మాటలు మెండుగనే యుండెను.

ఆపరిసరములు శ్రీరామం మంచిపేరును పలుకుబడిని సంపాదించెను. క్రమముగ నాటపాటలలో కూడ నతని ప్రోత్సాహ మావశ్యకమగుటచే నతడుగూడ నాటలలో గొంతకాలము వెడల బుచ్చువాడు. ఆ యాశక్తి ప్రబలి పోటీలకై కృషిసలుపునట్లు జేసెను. క్రమముగ నతని పట్టుదల క్రీడలవైపునకు గ్రీడలనుండి నాటకాదులవైపునకు బోయినది. విలాసము గర్వము యతనిపై నావేశమాయెను. విలాసము పెంపొందుట సులభము. సంగెడికాండ్రు పలువురు వారిసహవాసమున నొక్కటొక్కటిగ వ్యసనములు శ్రీరామము నాశ్రయించెను. ఏయుద్యమ నాయకుడైన నన్యతావులనుండి యనకాపల్లివచ్చిన శ్రీరామంచూపు శ్రద్ధ మిక్కిలిగ నుండును. వారువెడలిన తరువాత గ్రమముగ నలవరచుకొను చుండిన దినచర్యలో నిమగ్నుడగువాడు.

ఇట్లుండ కళ్యాణం వివాహపు ప్రయత్నము లతనికి దెలియవచ్చెను. అతనికి కళ్యాణమును పెండ్లాడవలెననెడి కోరిక గలిగెను.

కళ్యాణం పైడిశెట్టిగారి కుమార్తె. పైడిశెట్టిగారు పట్టణపు ధనవంతులలో నొకరు. కళ్యాణం అతనికి మిగిలిన సంతానము. ఆమె పసితనమున తన చెల్లెలి కుమారునకిచ్చి వివాహము జేయ పైడిశెట్టిగారు సంకల్పించిరి కాని యాయనభార్య కనకమ్మ కాయన సంకల్పము నచ్చలేదు. ఆ యన సంకల్పవిఘాతమున కామె ప్రయత్నమొనర్చెడిది.

కారణము మేనరికమున కిష్టములేక. పైడిశెట్టి చెల్లెలగు రత్నాంబ యొక్క పేదవాని భార్య. ఆ పేదకుటుంబములో దన పిల్లనిచ్చుటకు గనకమ్మకు సమ్మతములేకుండెను. ఇంత కార దాచట్టమమలులోనికివచ్చెను. రత్నాంబయోపిక బట్టజాలక తన కుమారున కన్యథా వివాహము గావించెను. కనకమ్మకు సంతసము మెండాయెను. కాని పైడిశెట్టిగారుకళ్యాణమునకు వ్యక్తురాలవుటకు బూర్వమే పెండ్లిచేయ యత్నించిరి. చెల్లె లు తన సంకల్పమునకు వ్యతిరేకముగ నడచినదని చెల్లెలిపై నతడు కోపించెను. కనకమ్మ అయిష్టత యందులకు గారణ మని యాయనకు దెలిసినను రత్నాంబపై నతడు కినుక వహించెను. తరువాతి యత్నములలో కనకమ్మ భర్తకు సాయమొనర్చుచుండెను. గాని విధాత మానవసంకల్పము నకు వ్యతిరిక్తముగ వ్రాసినలిఖితమునకు రాక దప్పదు. కన కమ్మజబ్బుపడెను. ఆమెజబ్బు దినదిన మభివృద్ధికాజొచ్చెను. కళ్యాణం ఆరోజులలో రజస్వలయాయెను. పైడిశెట్టిగారేమి జేయుదురు ? అయినదేదో అయినది కనకమ్మజబ్బు కుదిరిన తరువాత కళ్యాణం పెండ్లి తలపెడదామ"ని యతడుభావిం చెను. కనకమ్మ రోగము చికిత్సవలన బోలేదు. నివారణ కాలేదని మం దిప్పించుట మానలేదు. దీర్ఘరోగము దీసి కొని యామె కొనకు మరణించెను.

విచారదినములు త్వరగ గతించెను. మరల కళ్యాణం వివాహప్రయత్నములు సాగుచుండెను. అప్పటికి వైశ్య

లలో రజస్వలానంతర వివాహోద్యమ సంఘమొకటి స్థాపిత మయినది. శ్రీరామంకూడ నాసంఘములో జేరెను. శ్రీరామం మాణిక్యమునకు దగ్గఱబంధువు. కనకమ్మ చనిపోయిన తరువాత పైడిశెట్టిగారు తనపినతల్లి కూతురగు మాణిక్యమును వారియింటికి రప్పించెను. ఆమెయే నాకుటుంబమున కిప్పుడు దక్షత. మాణిక్యంభర్త దివంగతుడై చాలవత్సరములాయెను. ఆమె యత్తవారింటనుండి చాల యిడుమలకు లోనగుచున్నను వాటిని లెక్కింపక కాలము గడుపుచుండెడిది. ఆమె విద్యావతి. ముప్పదివత్సరము లామెవయసు. పైడిశెట్టి యామెను దనయింట నుండుమని కోరుటచే నామె పైడిశెట్టిగారి యింటికి వచ్చినది. అచిరకాలమున గళ్యాణి యామె విద్యాసామర్థ్యములను గ్రహించినది. మాణిక్యమునకు గళ్యాణిపై ననురాగము దినదినాభివృద్ధికాజొచ్చెను. కళ్యాణం తండ్రి తల్లి లేనిలోటును మరచుచుండెను.

మాణిక్యం పైడిశెట్టిగా రింటికి వచ్చినది మొదలు శ్రీరామం పైడిశెట్టిగా రింటికి బోవుట మొదలిడెను. "పిన్నమ్మా" యని మాణిక్యమును బిలచుచు నామెతో చనవుగ మాటాడువాడు. కొన్ని దినములకు శ్రీరామం గళ్యాణితో బరిచయము గలిగించుకొనెను. మంచి యదను దొరకినది. శ్రీరామం మాణిక్యం కళ్యాణులతో మాటాడునపుడు నవీన నవలా పత్రికలనుగూర్చియు నవీనమగసిద్ధాంతములను గురిం

చియు ముచ్చటించుచు ప్రేమయే జగదాధార మనియెడి సిద్ధాంతమును మధుర వాక్కుల వర్ణించుచువాడు. కళ్యాణి యాతని ప్రతిభకు ముగ్ధయగుచుండెను. మాణిక్యం యతని మాటలధోరణి యొక్క యుద్దేశమును గ్రహించినది. ఒకానొక సమయమున శ్రీరామం యొక్క యుద్దేశ్యము నడిగెను. శ్రీరామం కళ్యాణిని ప్రేమించితినని యామె కెరింగించెను. కాని మాణిక్యం నూత్న భావాలతో ఏదో పిల్ల దొరికిందికదా అని నీవు ప్రేమ వెల్లడించు చుంటివా లేక నిజముగ కళ్యాణిని ప్రేమించితివా ? అని ప్రశ్నించెను. శ్రీరామం అందులకు "నే బ్రహ్మచారినికదా! పిన్నమ్మా ! పెళ్ళిచేసుకోవాలని వుండదా" అని సమాధాన మిచ్చెను. మాణిక్యమునకు సంతుష్టి కలుగలేదు. ఆమె యెట్టి యభిప్రాయమును తెలుపుటకు పూర్వమే రాయబార ములు ప్రారంభమయ్యెను. పైడిశెట్టిగారు "మనలో ఆలాటి వరుడు దొరుకుట అరుదు. తప్పక పిల్లనిచ్చెద" నని మాట యిచ్చెను. మాణిక్యము మారాడుటకు సంశయించి యూర కొనెను. పెండ్లి నిశ్చయమాయెను.

తరువాతగూడ శ్రీరామం పైడిశెట్టిగారి గృహము నకుబోవువాడు. కళ్యాణమున కతనితోమాటాడుటకు సిగ్గగు చుండెడిది. కాని యాతని సందర్శనమునకు మురియుచుండె డిది. ఆమె శ్రీరామమును మనసార ప్రేమించెను.

పైడిశెట్టిగారి మేడపైనుండియే శ్రీరామం రోజాబీని ప్రథమసారిజూచుట తటస్థించెను. రోజాబీనిజూచిన శ్రీరా

మమునకు బ్రిక్కనిలువబడియున్న ప్రేయసికూడ మరపునకువచ్చెను. తనకనులను రోజాబీదాటువరకత డామె సౌందర్యమును గ్రోలుచు నామాధుర్యమునకు ముగ్ధుడై యుచేతనుడయ్యెను. ఆమె దృష్టిబారినుండి వెడలినతరువాత శ్రీరామం చేయునదిలేక మడతకుర్చీలో కూలబడెను.

కొన్నినిముషములైన తరువాత శ్రీరామం ఆయిరువురిస్త్రీలయొద్ద శలవుదీసికొని బయటకొచ్చెను. రోజాబీ యావీధిలో నతనికి గోచరించలేదు. పైమేడమీదనుంచి యతని వర్తనము గనిపెట్టెదరేమో ననియెడి సందియ మప్పుడతనికి గలుగ నతడు తనయింటివైపుగబోయెను. కాని లోన రోజాబీ యెచటనుండినదియు గనిపెట్ట తమకించుచుండెను. చూపు, మెప్పు, వలపు ఒకటొకటిగ నతనియందు గలిగిన భావములు. మేడదిగినతరువాత రోజాబీని కానక యతడూహాప్రపంచమునకుబోయి యందు విహరించునపు కాముకత్వము చెలరేగెను. రోజాబీ సందర్శన సుఖమేకాదు ఆమెనెట్లయిన బొందవలయునని యెడి కోరిక యతనిలో స్థిరమాయెను.

శ్రీరామమునకు గోరిక నెరవేర్చుకొనుట కుపాయము దొరకుటలేదు. ఆసాయంకాలము వరకతడాలోచించుచుండెను. ఇంకొకరి సహాయ మపేక్షించుటలో దోసముండునని యతడనుకొనెను. దానివలన గార్యభంగము వాటిల్లుట తటస్థించునని యెడి యాలోచనకూడ గలిగెను.

అవతలి రోహిలాలలో నేరికైన దనయుద్దేశ్యము దెలిసిన నాపదకలుగుట నిశ్చయము. పరిపరి యాలోచనలలో సాయంకాలమయ్యెను. పైకిబోవునప్పటిదుస్తుల నతడుధరించి యింటినివీడిన తరువాత మరలనొక యాలోచన కలిగెను. ప్రతిసాయంత్రము జేయునట్లు పైడిశెట్టిగారి గృహమునకు బోవకుండుటయా! పోకున్న గలుగునష్టమేమి? ఏలనో మరల నాయింటి కే నతడు నడచెను. లోనికిబోవుసరి కతనికంటబడి నది కల్యాణం. ఆమె యొంటిగనుండెను. కల్యాణం శ్రీరామమునుజూచి పెరటిలోనికిబోయి మాణిక్యమును బంపెను. మాణిక్యం శ్రీరామమునుదీసికొని మేడపైకి బోయెను. మరి కొన్నినిముషములకు గల్యాణి రెండుపాత్రలతో వారుండు స్థలమునుజేరుకొని యాపాత్రలను శ్రీరామం యెదుట బెట్టెను. అందొకటి మంచినీటితోనుండెను. రెండవదానిని జూపుచు మాణిక్యం "మా దురగడిలవు ఈనిందట. ముర్రి పాలు తెచ్చాడు. అదిగో జున్ను కొంచం పుచ్చుకో అబ్బాయి" అని పలికెను. శ్రీరామం "ఇప్పుడే కాఫీతాగొచ్చాన"ని యనెను.

మాణిక్యం "దానికేం. కొంచం పుచ్చుకోవోయ్" శ్రీరామం జున్నుండిన పాత్రనందుకొని యందుంచబడిన చమ్చాతో గొంతయారగించి పాత్రను గ్రింద బెట్టెను. మాణిక్యం "బెల్లంవేసాం. నీకు రుచిగాలేదేమో!"

శ్రీరామం "బెల్లం వెయ్యడంచేతే చాలబాగుంది. కాని జున్ను వేగం అరిగేటదార్థంకాదు."

అతనిమాటకు మాట సమాధాన మిచ్చుచుండెను. కాని నిత్యమతనిముఖమున జూడబడుచుండెడి నిష్కాపట్య మతనిలో గోచరించుటలేదు. అతనిమన మన్యథాయుండెను. ఆసమయపుగోష్ఠి యతని కాకర్షణీయముగలేదు. అభిరుచి యెంత వేగము మారినది? కానున్న భార్యయందలి ప్రేమ యపుడే మాటుబడుటయా! ఏమో. అతనికా విషయమై యనుకంపము కలుగలేదు. గృహాస్తవృటకు పూర్వ మూరక మనము నరికట్టి యుంచవలసినదేనా. అందు రోజాబీవంటి యువతి చేకూరిన గలుగుసుఖమును వదలుకొనుటయా. వివాహము నిశ్చయపుకానిమ్ము. నిశ్చయమైన వివాహము కాకుండనిమ్ము. వాటితో నాడు శ్రీరామమునకు బనిలేదు.

కొంతసేపయినతరువాత శ్రీరామం వీధిలోనికివచ్చె ను. అతడు బీటిప్రదేశమువైపునకు నడచుట మొదలిడెను. కొంతదూరమరుగుసరి కొక్కసారి యతనిశరీరము కంపిం చెను. "రోజాబీ అభిమానవతి. ఆమె తనకైజారుతో బాధ చిన నేమిగతి" యని యతడు భయమందెను. కాని యతని యభిలాషాతీవ్రత నాభీతి నణగద్రొక్కుటచే ముందునకు సాగెను.

• నడచునప్పుడతని కండ్లును జెవులును బహు మెలకువగ నుండెను. పేశబ్దమైన నతడు ద్రుళ్ళిపడి జూచుచుండెను. చంద్రోదయ మవజొచ్చెను. సూర్యు డస్తంగతుడగునమయము కూడనదియే. తూర్పుదిశయంత కాంతివంతముగ లేదు. తరువాత సంధ్యసమయము - మెల్లగ తిమిరమును జొరనీయకుండ జంద్రకిరణము లలముకొనియెను. శ్రీరామం బీటిని సమీపించెను. రోహిలా లనేకవినోదముల బాల్గొని యుండుట నతనికి గనబడెను. కానియందు రోజాబీ నెట్లు గుర్తించగలడు! గుర్తించి యేమిచేయగలడు? అస్థలమును వీడుట యనుభావ మంతరుచిగ లేదు. నాగరక కృత్రిమ జీవితమునకును స్వతంత్ర్యేచ్ఛతో తృప్తితో దిరుగాడు నారోహిలాలజీవితమునకునుగల వ్యత్యాసము పొడగట్టెను. కాని యట్టి సద్భావములు శ్రీరామంలో నాసమయమున నిలుకడ వహించునా? అంతలోనేదియో నతనిమదికిదట్ట శ్రీరామం వడిగనడిచి పోయెను.

ఆరాత్రియే రోజాబీ మియ్యాలు చెట్టుక్రిందగలసి మాటాడుటయు రామయ్యను రోజాబీ పరిహాసించుటయు జరిగెను.

ప్రత్యేకమానవుల కష్టసుఖములతో బనిలేదనునట్లు మరునాడు పట్టణమంతయు యథారీతిగ గార్యసంచలనత గాంచెను. రోజాబీ పరివారము పట్టణమున దిరుగిడ మొదలు

లిడిరి. అనాడుకూడ నాసాబీయే రోజాబీతోనుండెను. ఆయి రువురెచటికిబోయిన నచట ప్రేక్షకులు గుంపులుగ గూడు చుండిరి. అనాడొక ముసలిది యాగుంపులో నుండెను. ఆమె రోజాబీని జూచి యశ్రుపూరితనయనములతో ముందునకు వచ్చి మరలమరల రోజాబీని జూడసాగెను అయూరి వారికామె పరిచయురాలే. కావున నామెను జూచిన కొంటి పిల్లలు "పిచ్చిముసలిది వచ్చింద"ని కేకలువేయ మొదలిడిరి. వారికి మరింతవినోదమునకు ముసలిది కారణమయ్యెను. కేక లతోనాగక కొందరు రాల నాముసలియామెపై రువ్వ సాగిరి. ముసలిది దెబ్బతగిలినపుడు బిల్లలనుదిట్టుచు మరల రోజాబీని తీక్ష్ణదృష్టుల జూచుచుండెను.

పిల్లలయరపులకు పిచ్చిదాని తిట్లకు రోజాబీ విసిగి యొకపరి వెనుకకుజూడ నాముసలిది యేడ్చుచు నామె నాలింగనమొనర్చుటకు బ్రియత్నమొనర్చెను. పిల్లలు కేక లధికమయ్యెను. రోజాబీ వారిని వారించి ముసలిదానికొ కించుకదూరముగ బోయినిలచి "ముసలమ్మా! అల్లరిచేస్తారు. ఇక్కడినుంచి పో," అని పలికెను. ముసలిది పోలేదు. రోజాబీ మరల "ఏడ్చెదవెందులక"ని యడుగ నాసాబీ "పిచ్చిదట. దానినడిగినా లాభమేమిట" ని యూరడించెను.

వారేతావునకు బోయిన నాతావునకు ముసలిదిపోవు చుండెను. ఆమె జీర్ణవస్త్రములను విషాదయాకారమును

జూచి రోజాబీ యామెకొక యణాకాసునందింప నాముసలిది దానినందుకొనక "నువ్వు మా నూర్జానువుకావా" అని యడిగెను ఆపలుకులకు రోజాబీ ముసలిది నిజముగ పిచ్చిదే యనిభావించెను. చుట్టుజేరినపిల్లలు ముసలిదానిని మరింతగ బీడింపమొదలిడిరి. రోజాబీ విషాదముతో "ముసలమ్మా! నేను మీ నూర్జానుకాన"ని తెలియజెప్పెను. పిల్లలలో కొందరు "రోహిలాలను పెంచుకుంటుంది పిచ్చిద"ని కేకలువేయుచుండిరి. ఆరంగము రోజాబీచిత్తమును గరగించెను. కాని యేమిచేయగలదు? ముసలిదానిభ్రమ నెట్లు తప్పించగలదు! రోజాబీ ఆషాబీలు గుడారముల జేరుకొనిరి. ముసలిది దుఃఖముతో తనజీర్ణ కుటీరమును జేరుకొనెను.

ఆముసలిది యెవరు? ప్రస్తుతమామెయొక పిచ్చిదానివలె బరిగణింపబడుచుండెను. కాని యామె నిజముగ మతిచెడినదికాదు. ఆమెకాపురస్థల మాపట్టణమే. ఆమెయొక మహమ్మదీయస్త్రీ. భర్తనుగోల్పోయి యామె తనయొక్క కూతుతో నాపట్టణమున నివసించుచుండెను. ఆమెపోషణకై మూలధనము కొంతయుండెడిది. తరువాత చీరలకు జల్తారు చెమ్కీ మున్నగువాటిని గుట్టుచు స్వపరిశ్రమవలనగూడ నొకింతయాదాయమును బొందుచుండెడిది. ఆమెకూతురు నూర్జాన్. అప్పటికి నూర్జాన్ రెండేండ్లబాలికయై యుండెను. ఆమెముద్దు మోమునుజూచి, యాచుట్టుపట్ల వారందరును

సూర్జాను దమతమయిండ్లకు గొంపోవువారు. తల్లికి పిల్ల యనిన ప్రేమయధికముగ నుండెడిది. కాని పొరుగువారు జాతి విచక్షణజేయక తనబిడ్డ ననురాగముతో జూచుచుండుటచే నామె కాంధోళనమేమియు గలుగుచుండెడిదికాదు. ఇట్లు దినములు గడచిపోయినవి. సూర్జా బాగుగ నడువ శక్తిగలిగి యిరుగుపొరుగులవారిండ్లకు దనంతటగ బోవసాగెను. ఒక దుర్దినమున నామె యామెతల్లికిగాని యాపట్టణవాసులకెవ్వరికిగాని మరి కనబడుట మానినది. సూర్జాపై యభిమానమున్నవారందరామెకై విలపించిరి. యనేకశోధాలను జేసిరి. కానియామె యెచటనున్నది యేమైనది తెలియలేదు. తల్లిమాట జెప్పవలవికాదు. ఆమె దినములాదిగ నన్నపానాదుల గోరకయే ప్రమానువలె నిర్జీవమై పడియుండెను. సూర్జాపోయిన నామె సర్వస్వము గోల్పోయినది. ఆమె యింటిజ్యోతి, ఆమెప్రాణజ్యోతి యంతరించినతరువాత నామెకు బ్రతుకెక్కడ? కొన్నిదినములకు మరల వ్యామోహమావహించినది. ఆమె లేచి యాదుర్భరస్థితినిగుర్తించినది. ఆమె ప్రేమైకవస్తువునకై స్వయముగ నన్వేషణము బ్రారంభించెను. వత్సరములట్లు గ్రామగ్రామములు దిరుగాడినది. ఎచటనుగానక నిరాశతో నింటినిజేరెను. ఆమెతృప్తియానందమయ జీవితము మటుమాయమయ్యెను. ఆమెబుద్ధియే నసించినది. ఒకటియే నామె దృక్పదమున నిలచినవస్తువు. మెలకువ సమయములందు స్వప్నసుషుప్త్యావస్థలయందు

గూడ నామెకు నూర్జాహాతలంపే. నూర్జాహా ప్రతిమయే నామె
యెదుటనిలచియుండెడిది. వత్సరములు గతించినను రెండేండ్ల
బాలికామూర్తియే తల్లితలంపున నుండెడిది. తల్లి కామూర్తిని
జూచుచుండినకొలది యానందమునకు మారు విషాదము
కలుగుచుండెడిది. ఆవిషాదముతో నామెచూపు బాహ్యచేష్ట
లకు నామె మతిచెడినదని యాపట్టణవాసులందరు భావిం
చిరి. పూర్వపుపరిచయముచే నామెపై జాలిగలయుదారులామె
యింటినినే యుంచుట నామె యాహారమును గైకొనునట్లు
జేయుట గలిగెడిది.

రోజాబీనిజూచిన నాముసలిదానియూహా వీచికలు
భావతరంగము లెగయజొచ్చెను. తనముద్దుబిడ్డను గోల్పో
యిన కాలపరిమితినామె లెక్కింపజొచ్చెను. రెండేండ్ల పసి
కూన యాభుక్తకాలమున బెరిగి యౌవనవతియగుట సాధ్య
మని యామె యూహించినది. ఆ పెరిగిన యువతియే రోజాబీ
యని యామె భావించినది. రోజాబీముఖ మన్నివిధముల
దనకూతురుముఖమును బోలియున్నది. ఆమె చిఱునగవు
నూర్జాహా నవ్వువంటిదే. ఆభావ ముత్కృష్టతగాంచెను.
ముసలిది రోజాబీని మరల నెట్లువిడువగలదు? మధ్య నొక
యనుమానమైన గలుగలేదు. నూర్జాహా రోజాబి ఎట్లగును.
లోహిలాలలో నూర్జాహా యుండుట నెట్లు పొసగుననెడి
యాలోచన ముసలిదానికి గలుగలేదు.

ఆయుదయమున నే శ్రీరామం భవనమునకు బోయి యుండెను. అతను భవనమును జేరి రామయ్యను బిలిచెను. రామయ్య తనకుటీరమున బల్దియున్నమునుదిని యేమిపని జేయుదమని యాలోచించుచు సాధువు జ్ఞప్తికిరాగ బూలు కోయుట కుపక్రమించెను. అంతలో శ్రీరామం పిలుపువిన బడ నతడు వడిగ భవనపు ముందుభాగమునకు వచ్చెను. అచట శ్రీరామమునుగని యతను "దండంబాబయ్యా! ఏమిఃశలవ"ని యడిగెను.

శ్రీరామం "రామయ్యా! తోటబాగుందా? ఎవరికో పువ్వులుకోస్తూన్నట్టుంది? ఎవరికి"

రామయ్య "ఆసాలలో సాధువు బాబాకాయన దిగే డండి ఆయునపూజకు కోస్తున్నానండి"

శ్రీరామం "గులాబీపువ్వులు బాగాపూస్తున్నాయి. ఏదీవకపువ్వు, ఏమిటిచేస్తావు వాటిని"

రామయ్య "గులాబీలు చాలావుంటే షాహుకారు బాబయ్యగారి కిస్తానండి" తరువాత రెండుగులాబీ పువ్వులను గోసి శ్రీరామమున కందింప యతను వాటినందికొని వాని పరిమళము నాఘ్రాణించుచు, "రామయ్యా! ఈయిల్లు రాత్రికికావాలి. ఒకసారి రాత్రి తాళంతీసి వుంచుతావా" యని యడిగెను.

రామయ్య "బాబుగారి శెలవు లేందీ......తమశెలవు కెప్పుడు లేదన్నారండి, అయినా వారిచెవిని కడ వేయండి"

శ్రీరామం "ఆసంగతి నేను చూచుకుంటా కాని ముందుగా ఎవరికీ నువ్వుచెప్పొద్దు. రాత్రి తాళంతీసివుంచు"

రామయ్య, "చిత్తం"

శ్రీరామం, "అయితే ఆరోహిలావాళ్ళను బీటిలో దింపావు. పుల్లలకనీ ఆకులకనీ తోట పాడుచేయరూ?"

రామయ్య "నానుదింపేదేటి బాబయ్యా! ఆళ్ళైదిగారు తోటలోకి రాకుండా చూచుకుంటున్నానండి, పిల్లలుకూడా రావడం లేదండి"

శ్రీరామం "అవును కాని నీకు వాళ్ళపరిచయం అయిందా? లేకుంటే నీమాటవాళ్ళు లక్ష్యంచేస్తారూ!"

రామయ్య "వాళ్ళపరిచయం నాకెందుకండి?"

శ్రీరామం "వాళ్ళనుచూస్తేనే భయం, పోనీకాని మంచి ధైర్యసాహసాలు కలవాళ్ళు, మంచిఅందమైనవాళ్ళు, వాళ్ళలో ఓకిల్లవుంది మంచి అందమైంది."

రామయ్య "నాకెందుకండి బాబూ! వాళ్ళందం చందం."

శ్రీరామం "మనకెందుకులే వాళ్ళసంగతి," శ్రీరామం ఆలోచనలోబడెను. రామయ్యద్వారా నతడు కృతకృత్యుడగుట సందేహించుచుండెను. రామయ్య అమాయకుడు. ఏపనిజెప్పిన జేయువాడు. అతని సహాయమున గాని

యన్యుల సహాయమున దనపని నెరవేరుట దుర్లభము. ఏవంక బెట్టియయిన రామయ్యా రోజాబీతో మాటాడగలను. కాని రామయ్యాకు రోజాబీసంగతి యెట్లుదెలియును. ఆమెనుపోల్చు కోలేకపోయిన కార్యభంగము నిశ్చయము. శ్రీరాము చాల నాలోచించి స్వయంకృషి నలుప నిశ్చయించి "రామయ్యా! నే వెళ్తున్నా, ఇదిగో యీ అణా కాసు తీసికో" అని యొక అణాకాసు నతనికిచ్చి వెడలిపోయెను.

అతను వెడలిక తరువాత రామయ్యా మెట్లపై జతికిల బడి "ఏం వయ్యారంగా కబుర్లు చెప్పేడు. ఆపడుచుపిల్లపై కళ్ళుపడ్డాయి కాబోలు. రాత్రి గలభాచేస్తాడేమో. మాచె డ్డోడు. పట్టినపట్టు వదలడు. ఆపిల్లకోసం వెళ్ళి యేం తెచ్చు కుంటాడో" అని యతడూహించుచుండెను. అతని యాలో చనా ఫలితముగ నతని యందలి యనురాగ వీచికలు పెను తరంగముల లేవగొట్టెను. రోజాబీ చేసినపరియాచకము నతడు వెనుకకునెట్టెను. 'తనకెట్లయిన రోజాబీ యందరాని పండ'ని యతడూహించెను. తలచినకొలది యామె సౌంద ర్యము దైవసమముగ నతనికి దోచెను. అట్టి రోజాబీని శ్రీరాముం కోరుట దగదని యతని విశ్వాసము. శ్రీరాముం రోజాబీల కులములువేరు. కేవలము కాముకుడై యామెను చెరుప నుద్దేశించుట శ్రీరామమున కొప్పదని యతని యభి ప్రాయము. ముందురాత్రి మియ్యా రోజాబీల సంభావణ

యతనికి జ్ఞప్తికి వచ్చెను. ఆమె భావములతని కామె యందు గలుగు చుండిన గౌరవమును వృద్ధిజేసెను. ఒక్కనిట్టూర్పు వదలి రామయ్య "వద్దు. అదికాకుండా ప్రాణాలని భగవం తుని ప్రార్థిస్తా. కల్లబొల్లి కబుర్లు చెప్పి వలలో వేసికుంటే ఆ అమాయకురాలు అపవిత్రబాల చెడిపోవును. ఆమెను మంచి దారినుంచి తప్పించి అబాబుపోతే ఆమెగతి ఏమవు తుందని" యతడు చింతించెను.

తోడనే సాధువునకు బుష్పముల నిచ్చుట జ్ఞప్తికి రాగ నతడు మెల్లగలేచి కొన్ని పువ్వులనుగోసి సాధువున్న సాలకు బోయెను. సాధువు మౌనమూనియుండెను. పుష్ప ముల నటవదలి యొక ప్రణామముతో రామయ్య యాసాల నుండి బైటకువచ్చెను. సాధువున కేమియు దోచుటలేదు. రామయ్య యటనుంచిన పువ్వులలో నేమియో వెదుక జొచ్చెను. ఆపువ్వులయందేమి యగవడలేదో సాధువొక నిట్టూర్పు బుచ్చెను. వాటిని మరల నొకటొకటిగ నెంచుచు గొన్నిటిని నాసికయొద్దనుంచి మరల క్రిందవేయుచు సాధువు కొంతకాల ముండెను.

రోహిణాలు బీటిని జేరుచుండిరి. సాధువు మెల్లగ సాలనుండి యారామములోనికి బోయి యొక చెట్టునీడను గూర్చుండెను. అత డట్లెంతకాల ముండెనోగాని యొండు మూనసి యాయారామములోనికి వచ్చుధ్వనిని విని యతడు

ముఖము నలుమూలలల ద్రిప్పెను. రోజాబీ వాల్చినతలతో నావైపున కొచ్చుచుండుట సాధువు గుర్తించెను. సాధువు శరీరము కంపించెను. అతని చూపులు వ్రాలెను. కాని యతడు చిత్తమును జిక్కబెట్టి యాసుందరి సోయగమును నయనముల గ్రోలసాగెను. రోజాబీ సాధువున్న చెట్టును దాటి యొకటి రెండడుగులిడెను. ఆమె సాధువుయునికి గుర్తించలేదు. సాధువు "బిడ్డా! ఎటబోయెదవ"ని రోజాబీని బ్రశ్నించెను. రోజాబీ త్రుళ్ళిపడి వెనుకకు జూచి యచట నాగిపోయెను. ఆమె ప్రత్యుత్తర మీయలేదు. సాధువు, "భీతికి కారణంలేదు. ఒక్కనిముసము నిలువుము." రోజాబీ యాసాధువు నామూలాగ్రముగ జూచినది. అతని యంద మున కబ్బురపడసాగెను. సాధువామె మౌనమునకు గినుక జూపకయే, "చానా! నేసాధువునని యాలోచించుచు న్నావా? ఒక్క విషయమున్నది నీతో ముచ్చటించవలెన"ని బలికెను. రోజాబీకి వెరపుగాని భయముగాని కలుగలేదు. ఆమె యతని సమీపమునకు వచ్చినిలచెను.

సాధువు. "మూడుజగముల మోహింపజేయు నీయుం దము ప్రశంసనీయము. నీయందమునకు నామనము చలించి నది. నీయందు బద్ధానురాగుడనైతిని. నాకోరిక మన్నింపుము నీవు కన్యవు. నాకోరిక మన్నించిన నీకెట్టిదోషము రాకుండ జేసెదను"

రోజాబీ "సాధూజీ! మీపలుకులు నాకర్థమవుటలేదు. మీ ప్రేమ విశ్వజనీనము. ఒక్కవ్యక్తిపై మీరంత బద్ధానురాగులవుట అనుచితము. నన్ను క్షమింపుడు. నేబోయెద"

సాధువు "పోవలదు. నిన్నుజూచినది మొదలు నా యోగసాధన నట్టేటగలసినది. అభంగమునకు నేచింతిల్లను ఒక్కసారి నీవు నాకానందమును గూర్చినచో"

రోజాబీ "ఆకసమున పక్షులు భూమిపై పచ్చని యీచెట్లు మీకానందమును గూర్చుటలేదా? గూర్చినవాని నేల మీరు కాంక్షించుచున్నారు?"

సాధువు "జాలమున కాచర్చలు? నే సహింపలేను. ఊఁ అనుము. ఇచట అనుకూలముగనున్నది."

రోజాబీ "నన్ను మీరు ప్రేమించుటకు నేకృతజ్ఞరాలను. కాని మిమ్ము నేప్రేమించుటలేదు. అందులకు క్షమింపుడు" సాధువున కేమియు దోచలేదు. రోజాబీ "సాధూజీ! ఈశరీరము నశించునది. దీనియందు మమత కలుగుట మీవంటివారికి తగదు. అన్నియు వర్జించియుండు మీకు భోగమేల? ఆతలంపులేల? నాకు శలవిండ"ని ముందునకు బోవుటకు మారుగ రోజాబీ వెనువిరిగి వెడలనుంకించెను. సాధువు తత్తరమున నిలువబడి "బిడ్డా! నా యాశఫలింపచేయవాడి నాకు సర్వమును తెలిసినను నీముఖము తొలుత చూచినది మొదలు నాబుద్ధి నశించినది నాజ్ఞానమింక పోయినది నామనము దుర్బలత్వము నందెను. ఇవన్నియు

దెలిసియు నే నేమియు చేయజాలకుంటిని. 'నాయీకోరికకెదు
ర్చదజాలను. నిన్ను పూర్తిగ నాశీర్వదించెదను నాకోరిక
మన్నింపుము''ని జాలిగొలుపునట్లుగ బలికెను.

రోజాబీ, "సాధుజీ! బిడ్డపై అట్టికోరిక కోరదగద"ని
పలుకుచు పరుగున బసనైపునకు బోయెను.

సాధువామె పారిపోవుటకు గుపితుడయ్యెను. ఆమె
కొంటెతనమునకు గినిసియు నాకొంటెతన మందద్భుతసోయ
గమును గాంచినట్లత డూహించెను.

౬

జీవితమందలి యొక్కొక్క యనుభవ మొక్కొక
రీతిగ బరిణమించును. ప్రపంచ మొక నవరసపూరితమగు
కావ్యము. జీవితాసుఖములు పాత్రములు. వాటిని మనను
జేసికొనుటలో నున్నది జీవితకూర్పు. అను[illegible]ము లసుయుక్త
ముగ నన్వయించుకొను[illegible]టలో నున్నది జీవ[illegible]దోహ[illegible]ము.
యుక్తి సమన్వయమున[illegible] కాధారము. కాని యుక్తితో నెట్టి
యనుభవమును వెనుకకు ద్రోయరాదు. మానవవృద్ధి కే
యనుభవము వ్యతిరిక్తము కాదు. [illegible]ంచిదైనను చెడ్డదైనను
మున్ముందు మంచికే దారిమాపును

రోజాబీ సా[illegible]వ్రల సంఘటనము రోజాబీకి ఖేదమును
గలిగించెను. ఆమెకు దన సౌందర్యముపై రోతజనించెను.
ప్రపంచమున మరెవ్వరైన నట్టి పొగడ్తలను వినిన గర్వించి

యుండును. ఎందరులేని ప్రపంచము శ్లాఘించునపుడు గర్వించి తుదకు గర్వభంగము నొందినారు? స్తుతిశ్లాఘ్యములు అణకువ కుపాధిగ జేసికొనట దుర్లభము. కాని యదియేనీతి. రోషాబీ గర్వించలేదు. ఆమె యణకువ మాట మరచి ఖేదమునబడెను. ఆమె యందము సాధువునుగూడ కదల్చినది. ఒకప్రక్క నాదూరు పొగడ్తలు, ఒకప్రక్క ప్రేక్షకుల కుతూహలము, ఇంకొక వైపునుండి కొ్రత్తనం ఘర్షణ. ప్రేక్షకులు గుంపులు గుంపులుగ నామె చుట్టు జేరుట జ్ఞప్తికిరాగ తన సౌందర్యమే యీగుంపు నాకర్షించుచున్నదని యామె కపుడు దెలిసెను. తోడనే యామెకు మరల యాచనకై ప్రపంచమును బోవకూడదనియెడి సంకల్పము కలిగెను. ఆమె తన లావణ్యావదన మొరుల నాకర్షింపకుండ నుండునట్లు జేయనమకట్టెను. కాని యెట్లా లావణ్యతను మరగుబరచుట? ఈసమస్య వీడకుండగనే శ్రీరామమూమె యెదుట నిలచినట్లాయెను. ఆమెసహజ ధీరత సడలిపోయెను. మీయాజ్ఞ ప్రణయభాషణము లామె కర్ణపుటముల బ్రతిధ్వనించుచుండెను. ఆమె యతనికిచ్చిన ప్రత్యుత్తరము గూడ నామె స్మృతికివచ్చెను. ఒకేవ్యక్తిపై ప్రేమనుంచుటగాని నుంచమనుటగాని స్వార్థమనుపించుకొనదా? అవును. కాదుకూడ. ఇదమిద్ధమని యిపుడామె చెప్పజాలకుండెను. శ్రీరాముము నొక్కసారియే జూచినది ఆలోలిచూపుతో నామె మనసుతనియందు లీనమయ్యెను.

ఆమె స్వరమును మిర్యామెదుట గంపింపజేసినదా భావమే. అపుడా భావమస్పష్టము. ఇపుడామె యొకవ్యక్తిని ప్రేమించినట్లు స్ఫుటముగదోచెను. ఆభావ నిజరూపము నామె గుర్తించినది. విశ్వానురాగ మేమైనది? ఆమె యాలోచించినది శ్రీరామమును ప్రేమించుటయందు దోసగు లేదని యామెకు దట్టెను. సౌందర్యము నామె యుపాసించుచున్నది. ఆమెమనో పరివర్తనము వర్ణించుట కష్టము. అప్పటి కామె ప్రేమించుటయే నామెకు దెలిసినది. ఆప్రేమవలన జనించున దేమి యని గాని యదెట్లు పరిణమించునో యనిగాని యామె యాలోచింపలేదు. ఆలోచించుట కామె స్వభావమొప్పదు.

కాని మున్నెన్నడు లేని సిగ్గామె నావరించినది. ఆసిగ్గులో నామెప్రేమ వృద్ధిపొందసాగెను.

రామయ్యలో సంక్షోభము లేచినది. శ్రీరామం భవనమును విడిచినతరువాత ననేకయాలోచనలలో నతడుమునిగియొకయొద్దునకువచ్చెను. అతనికిరోజాబీ సందర్శనాభిలాష మిక్కుటమవ నాబీటిసమీపమున దిరుగాడ నారంభించెను. సాధువు రోజాబీల సంభాషణ నతడు ఆమూలాగ్రముగ వినెను. రోజాబీయొక దేవతయని యతడూహింపసాగెను. ఆమెనిశ్చల భావములకాతని మనసుపొంగెను. కాని సాధువునకు స్త్రీవాంఛకలుగుట వింతగదోచెను. సాధువుపై గల గురుభావము కదలుచుండెను. అతనిప్రేమ జ్ఞప్తికి వచ్చెను; శ్రీరామంపైగల యనుమానముమాట మరువ

లేదు; మిధ్యాగాధ కండ్లయెదుట గన్పట్టుచుండెను. ఇందరి
మనముల నాకర్షించుట కారోజాబీపై నతనికి జాలిగలిగెను.
ఒరుల నాకర్షించుటలో నామె యిచ్ఛలేదు. ఆమె అయిష్టత
గూడ నతడెరుగును. కాని యందరామెనుపీడించుట పాడి
కాదని యతడెంచెను. సాధువు ముఖ్యముగ దుర్బలుడగుట
కతడు సహించలేదు.

౧౦

కాలమొకరికై వేచియుండునది కాదు. ఒకరియాజ్ఞ
ననుసరించునది కాదు. కార్యములన్నియు దానిపై నాధార
పడియుండును. కాలములేనిదే జీవితమే లేదు. ఆకాలమే
మనలను నియమబద్ధులను జేయుచున్నది. దానిభాగమగు
దినమొకేమాదిరిగ నడచుచున్నది. దానికి పరిమితిగలదు.
దినపరిభ్రమణములో వ్యత్యాసముండదు. కాని యాదినమే
కొందరి కొకక్షణమువలె గడచిపోయినట్లుండును, మరికొం
దరికొక దినమొక యుగమువలెనుండును. మానసికావస్థను
బట్టి యట్టివ్యత్యాసము కలుగునుగాని వ్యత్యాసము నిజము
కాదు.

శ్రీరామం సాయంకాలమునకై వేచియుండెను. అత
డెన్నిసారులో గడియారమును జూచెను. అతనికి కాఫీ సహిం
చలేదు. సూర్యునిపై శ్రీరామమునకు రోషముకలిగెను.
గడియారము సరిగనడచుచున్నదో లేదో ననియెడి యాలో

చన. నిముషములే దీర్ఘము లనిపించుచుండెను. ఎట్టకేలకు సాయంకాల మవజొచ్చెను. శ్రీరామం తనతలంపుల కను వగు వేసముధరించుకొని యింటినుండి బయటకు బోవ వీధి లోనికివచ్చెను. వచ్చునరికొకమిత్రుడు సైకిలునుండి దిగి, "శ్రీరామం! నా కబురందలేదూ? సినీమాకొస్తావా?" అని యడిగెను. శ్రీరామమునకా మిత్రుడొక భూతమువలెను మిత్రునిపలుకులు పిడుగులవలెను దోచెను. మిత్రునకేసాకు జెప్పియైన దప్పించుకొనవలెను. మిత్రుడు మరల, "ఏ మోయ్! ఆలోచనలోపడ్డావ్? అని ప్రశ్నించెను. శ్రీరామం జవాబుచెప్పక తప్పినదికాదు - "ఆలోచనేంలేదు. ఒక కార్యంకొరకై పోతున్నా- నీకబురందలేదు. ఉదయంలగా యతు తలదిమ్ముగానుంటే ఇప్పుడే బయలుదేరా? ఆపని చూడకపోతే చాలానష్టం కలుగుతుంది రేపొస్తా లేక పోతే రెండోఆటకివస్తాన"ని శ్రీరామం పలికెను. మిత్రుడు, "ఈఆటకే అంతా పోదామని నిశ్చయించాం. అదీకాకసినిమా మేనేజరు కొంచం గోరోజనం వున్నవాడిలా అవపడుతు న్నాడు."

శ్రీరామం "ఈవేళేఅల్లరి? అయినాచూదాం. నువ్వో పద. శర్మతోచెప్పి తరువాత కలుసుకుంటానని" పలికి వీధి లోనికివచ్చెను. మిత్రుడుకూడ వెడలిపోయెను. మరలనట్టి యాటంకములు కలుగకుండ శ్రీరామం చిన్నచిన్న సందు గొందులనంటి నడువసాగెను.

జీవితములో తలవనితలంపుగ జరుగు విషయము లున్నవి. ఇష్టములేని కార్యమునందు బనిచేయవలసిన యవసరమున్నది మనజీవితము మనయధీనమునం దుండదు. సంఘమానవునకీ పాట్లుదప్పవు

రామయ్య యథారీతిగ రోజాబీ యవలోకనామృత పానమునకై దిరుగాడుచుండెను. శ్రీరామం భవనతాళములు దీసియుంచుమని చెప్పుటచే నతడంతవరకు శ్రీరామునకై వేచియుండెను. శ్రీరామ మాభవనమున కెవ్వరినో మిత్రులను దెచ్చి యటబనజేయింపుటకలదు. కావున నతనియప్పటి యనుమానా మెట్లున్నను శ్రీరామమే యతిధినైన నాడు గూడ దెచ్చుననియెడి యాలోచనతో నప్పటివరకు వేచి యుండి యతనిజాడగానక రామయ్య స్వసుఖమునకై బయలు దేరెను. అప్పటికి గొంతతడవగుటచే రామయ్య వడిగ నాయారామప్రదేశమును జొచ్చునరికొక చెట్టుక్రింద నిరువురేకాంతసంభాషణలో నుండుటగనెను. అంతనతడొక చెట్టు మరుగుననిలచి యారెండువ్యక్తులను జూచుచు వారి సంభాషణ క్రమమును వినుచుండెను. రోజాబీ మియ్యాలేమా చెట్టుక్రిందగూర్చుని యున్నవారనియతని మొదటియుద్దేశ్యము కాని వారిసంభాషణధోరణినిబట్టి యాయభిప్రాయము మార వలసి వచ్చినది. రామయ్య మొదటవినినది రోజాబీపలుకులు. "నాజీవితమున నితరుని ప్రేమించుటకిదియే మొదటి

సారి. మాతండ్రి పైగల ప్రేమ వేరు. నాయీనూతన ప్రేమకు మీరే కారణము. ఈప్రేమ ఎంతగనాలోచించినను ఫలిత మును గాంచదనియెడి భయము కలిగెను. ఏలన? నేనొక విహంగమును. ఆహారమిచట దొరకిన నేనచటికి పోవలసినదే. నాకు స్థిరవాసరమునకు తావులేదు. అది పోనగదు నాకు మీరందరాని ఫలము. మీరు సద్వంశమువారు. నాకోరికల నందుచే ముందుకు సాగనీయదలచలేదు." ఇవి రోజాబీపలు కులు.

రామయ్యయీపలుకులకు సంతోషించెను. ఆమె శ్రీరామ మును ప్రేమించెనని యెట్లెరుగును? ఆపలుకునది రోజాబీ యని దెలుసుకొనుట కతనికెంతయో సేపు పట్టలేదు. కాని రెండవవ్యక్తిని బోల్చుకొన వీలుకలుగలేదు. ఎవరైననేమి రోజాబీయొక విధముగ నతనిదోసిపుచ్చు యత్నమునర్చు చున్నదనియే నతనిభావము.

రెండవవ్యక్తి "నీయూహలు పిచ్చివి. నామనమంతయు నీకర్పించితిని. ఇకనీకోర్కెలను సాగనిచ్చుట కభ్యంతర మేమి. నారాణివైనచో నిన్నెంతయైన సుఖపెట్టెదను." ఆకంఠస్వరము పరిచయమైనదే. బాగుగనాలోచించి యది శ్రీరామముదని రామయ్యపోల్చుకొనెను. అతడు ఉగ్ర మూర్తియై యారంగముననురికి తనవలపులరాణిని తనమనో దేవతను వంచించుట కుద్యమించిన శ్రీరామమునందుండి

తరుమసంసిద్ధు డయ్యెను. కాని వివేకి రెండవ యాలోచన లేనిదే నేపనినిజేయడు. రామయ్య రెండవయాలోచన నా రంగపరిమాణమును జూచుటయే. ఒకవేళ నాతెడాసమా వేశమున కంతరాయముగూర్చిన రోజాబీకోపించి యతని స్వల్పసుఖమునుగూడ పాడుచేయునేమో. రామయ్య ప్రేమ యందొరులతో పోటీచేయుటలేదు. అతనికీర్ష్యలేదు. అతని యాత్మసాక్షిగ నామెను బ్రేమించెను. ఆమోహనమూర్తిని జూచి యానందించుటయే నతనికిదృప్తి. ఇక నెవరితో పోటీ? కాని యతనిపై నావేశమయినది ముగ్ధయగు రోజా బీని ప్రాపంచక మాయాజాలమునందు దగుల్కొనకుండ జేయవలెననెడిది.

శ్రీరామం "నీప్రేమకు నేకృతజ్ఞుడను. వెర్రికోరిక గలిగి నేభ్రమించుచుంటినని భావించితిని. నీహృందెట్లు సమ కూడునని యాలోచించితిని. నీపరిచయమైన నాకుకలుగుట కష్టమని భావించితిని. మిగుల వ్యధజెందితిని. నామనో వాంఛ నన్నాపియాపి మొండిస్థైర్యము నాకిచ్చుటచే ఈ నాడు నీసాన్నిధ్యమును చేరగలిగితిని. ఇది దైవనిర్ణీతము. కాకున్న కలలోనైన నింతసులభముగ నిట్టిసంఘటన కలుగు నని నేనూహించలేదు. నీపదదాసుడను." రోజాబీ, సిగ్గున తలవంచి యూరకుండెను. శ్రీరామం మరలనిట్లు బలికెను. "రమ్మా, ప్రేయసీ? ఆభవనమునకు పోవుదము - అచట నన్నియు సమకూర్చితిని. నాతృష్ణ మెండగుచున్నది."

రోజాబీ, "వద్దు. అచ్చటికిపోవుటయన నాకు భయం కలుగుతూంది. ఇక్కడనేకూర్చుని మీమధురాలాపములను విననిండు."

శ్రీరామం "ఎంత బేలవు! మధురాలాపము లక్షయములు. ఎందున్ననూ అవి లభించును. నీపరిష్వంగసుఖము నాకు కలుగనిమ్ము."

రోజాబీ, "అంతయు నొకకలగావుంది. నీవుపలుకుచుండుము. నాయీసంతోషమున కడ్డు పెట్టకుము. నన్ను నీవు ప్రేమించితివి. నాజన్మ తరించినది. ఈభావములోనెంతమాధుర్యముంది. నేప్రేమించినయతడు నన్ను ప్రేమించినాడు. నాప్రేమ వ్యర్థముకాలేదు. నేధన్యురాలను, అహా! మరొక్కసారి పలుకుము. నాశరీరము నీమాటల కుపులకించుచున్నది. మరియొకసారి విననిమ్ము."

శ్రీరామం "ప్రియసీ! మాటలతో ఆకలి దప్పులు తీరునా! తీరవు. పద ఆభవనమునకు నినుప్రార్థించెదను"

రోజాబీ "ఎందులకా ప్రార్థన"

శ్రీరామం "నిన్నటు రమ్మని"

రోజాబీ "అదెందుకు!"

శ్రీరామం నివ్వెరపడెను. కాని యంత సావకాశము లభించిన నతడూరకొనువాడుకాడు. అతడు, "ఎందుకనా నీవు అడుగుట. నీకు నిజముగ తెలియదా?"

రోజాబీ "తెలియదు."

శ్రీరామం "మన ప్రేమ మాటలసంయోగముచే వృద్ధిగాంచదు. నిజముగ నీప్రేమ వృద్ధిగావలెనన్న ననేక రహస్యములున్నవి. ఇది తావుకాదు"

రోజాబీ "నా ఆలోచనలకు తావిమ్ము. మనము చూపువలన ప్రేమించుకొంటిమి. మానసికముగ నాప్రేమ వృద్ధి అయినది. ఇందు రహస్యము మిగిలియుండుటకు తావేది?"

శ్రీరామం "ప్రేమబద్ధులు దూరమును సహింపలేరు వారి కలయికయే ప్రేమ ఫలితము."

రోజాబీ "ఈ అనుభవాలు నాకుక్రొత్త. నాకు ఆలోచనకు వ్యవధినిమ్ము"

యువకుడు మారాడలేదు. నలువైపుల నొక్కసారి జూచి యామె హస్తము నతడు గ్రహించెను. దాని నతడు ముద్దుకొనెను. రోజాబీ కంపించుచుండెను. ఆమెకు సిగ్గు కూడ ముమ్మరమాయెను. ఆమె చేయిని వెనుకకులాగు కొనెను. ఆకొన్నసింగమువలె శ్రీరామముండెను. అతనికి రోజాబీ దేహకంపముతో బనిలేదు. ఆమెసిగ్గు స్త్రీల లక్షణముగ నతడు భావించి యామెకు జేరువుగ జరిగి యామెను దన బాహువల్లికల బంధించి ముద్దులశతమును గురిపించెను. సింగపుధాకకు భీతిజెందిన హరిణమువలె రోజాబీ యుండెను.

సమయముజూచి యామె శ్రీరామం హస్తములనుండి తప్పిం చుకొని నిలువబడెను. శ్రీరామం తత్తరమున లేచి "రోజా! వక్కసారి ఆభవనమునకురావా!" అని దీనముగా వేడి కొనెను.

రోజాబీ "నేడువలను."

శ్రీరామం "అయిన నేడువలదు. రేపు తప్పకరమ్ము నేనచటనే నీకొరకు వేచియుండెదను"

రోజాబీ యటనిలువలేక బరుగున దన గుడారమునకు బోయెను. శ్రీరామమునకు రోజాబీ బాకువెరపు లేకున్న నేమి చేయువాడో? రోజాబీ వెడలుటజూచి యతడుస్సురని వెడలిపోయెను.

ఒక చెట్టువెనుకనుండి రోషమున నొకవ్యక్తి వడిగ నాతనివైపునకు బోయెను. కాని శ్రీరామము నతడు కలను కొనలేకపోయెను.

౧౧

పంనుకొనియున్న రోజాబీకి నిదుర యావహించినది. ఆమెకు నిద్రాభంగము కాకుండా నాచేరువున నెట్టిశబ్దము గాకుండ జేసిరి. ఇట్టివి నిత్యము జరుగునదే. అందువింత లేదు రోజాబీ నిద్రగాఢముగనే యుండెను. ఆమె శ్వాస యందు లకు నిదర్శనము. ఆగాఢనిద్రలో నేమిగాంచెనో నామె చిఱునవ్వు నవ్వెను. ఆచిఱునగవులో సరిపోవలేను. ఆనిదుర

గాంచిన నయనములుదప్ప యొండు ముఖాబ్జమంతయు భావప్రతిబింబిత మగుచుండెను. స్వప్నమందులకు గారణ మని వేరుగ జెప్ప నౌసరము లేదు.

ఆ కలమధురమగునదని యుదయమున మేల్కాంచిన రోజాబీ చూపులు జాటుచుండెను. ఆమె ముఖమందెప్పటి తేజోత్సాహములకుదోడు నూతన కళయొకటి చూపట్టుచుం డెను. ఆనందము, సంతృప్తి యాశ్చాత్న కళాభావములు. ఆమె పట్టణములోనికి బోగూడదనియెడి నిశ్చయమును మరచినది. పట్టణములోనికి బోయినది. ఎప్పటివలె ప్రేక్షక సమూహము నడియాడుచుండిరి. ఎందుండి వచ్చెనో ముసలిది కూడ నామూకను జేరెను. ఆమె లోనికిబోవుటకు బిల్లలల్లరి జేయుచుండిరి. రోజాబీని సమీపించుట కామె ప్రయత్న మొనర్చుచుండెను. రోజాబీ యాదృశ్యమును జూచి మెల్లగ నాముసలి దానిని జేరబోయినది. త్రోవకడ్డముగానున్న ప్రేక్షకులు బ్రక్కలకొరిగి యామెకు దోవనిచ్చిరి. రోజాబీ ముసలియామె కరము నొకదాని నందుకొని తనసఖయుండిన స్థలమునకా ముదుసలి పోవచ్చెను. ముసలిదాని యానందము నకు మేర లేదు. కాని యా యానందముతో నశ్రువులు జల జల రాలమొదలిడెను. అవి యానందాశ్రులుగావు. ఆమెకు దుఃఖముకూడ గలిగినది. రోజాబీ సఖితో నృత్యము జేయు సాగెను. అలభ్యమని నిరాశజెందుచున్న ముసలియామె

రోజాబీ కటాక్షమునకు లోనయ్యెను. ఆమె నిశ్చయముగ దనకూతురే. కాని తనమాట విశ్వసించువారెవరు? ఆమె మరల తన జనుల గలయబోవునపుడు తనగతియేమని మున లమ్మ విలపించుచుండెను. రోజాబీకా ముసలిదానిస్థితి మిక్కుటమగు దుఃఖమును గలిగించెను. రోజాబీ తన చెలితో "నాకు తలనొప్పి యగుచున్నది. నే బసకుపోయెదన"ని జెప్పి యూస్థలమును బాసిపోవుచుండెను. ఆమెను ముసలిది వెంబడించుచుండెను. కాని రోజాబీ గమనమున కామె నిరుత్సాహముజెంది వెనుకబడి కూలబడిపోయి "నానూర్జా! ఆశ చూపించి వెళ్ళిపోతున్నావా? మనయింటికి రావూ? చల్ది అన్నంతినిపించెదను. పక్కనున్న వారి అవుపెయ్యిని చూపిస్తా ఆకలిలేదూ నీకు? నాచేతితో తిన ఇష్టంలేదు కాబోలు." అని యేమేమో పలుకుచు నేడ్చుచుండెను. రోజాబీ చెలి కత్తెకూడ నొంటిగ సంచారముజేయ నుత్సాహములేక వెనుకనే వెడలిపోయెను.

రోజాబీ బీటినిజేరుసరి కందొక రిద్దరుపిల్లలుదప్ప మ రెవ్వరునులేరు. ఆమె యాపిల్లలను బలుకరించకయే గుడారములోనికిబోయి యొకమంచముపై పరుండెను. ఆమెవెనుకనేవచ్చిన నామెసఖి యామెదేహమును స్పృశించి వేడిమిగానక "అక్కా! ఏమి వెళ్ళిపోయి వచ్చావు? తలభారముగావుందా. ఉష్ణంఏంలేనట్టుంద"ని పలికెను. అందుకు

రోజాబీ "చెల్లీ! తలభారంతప్ప మరేమీలేదు. కొంచం మంచినీళ్ళ నందుకో. నిద్రపోతే భారంతగ్గుతుంద"ని సమాధానమిచ్చెను. అంత నా రెండవయువతి మంచినీళ్ళనియ్య రోజాబీ వాటిని ద్రాగి కండ్లుమూసుకొనెను. రెండవయామె జాన్‌బీ. ఆమెమెల్లగ గుడారము వెలుపలకు వచ్చినది. రోజాబీ యెంతప్రయత్న మొనర్చినను నిదుర రాలేదు. ఆమె జీవితమునందు మున్నెన్న డనుభవించని మనోతాపము నామె యనుభవించుచుండెను. ముసలిదానికిని యామెకును గల సంబంధమేమి? ఏమిఆలోచించిన నేసంబంధమూ మెకు దోచలేదు. తరువాత శ్రీరామం జ్ఞప్తికివచ్చెను. అతడా రాత్రి భవనమునకు రమ్మనియెనే. ఆనందమున దుఃఖము దుఃఖమున నానందము. వీటినిమించినసిగ్గు. ఆమెయాలోచనలలో వీటికి స్థానమున్నది.

శ్రీరామం ఎవడు. అతనిసంఘమునకాతని ప్రేమ తెలుసునా. తన్నాతడు పెళ్ళియాడుట సంభవించునా? సంభవించిన వారికి సంఘములో కలిగెడి స్థానమెట్టిది. తన వారా వివాహ మంగీకరింతురా? అంగీకరింపరు. వలదు పెండ్లి వలదు. తనతండ్రియడ తానేమియు ద్రోహముచేయ లేదు. అతనిచెలిమియేవద్దు. నేడుండి రేపాపట్టణమును వదల వలసిన తానొకపట్టణ స్థిరవాసితో, జెలిమిజేసిన దుఃఖము ప్రాప్తించునుగాని సుఖమెట్టబ్బును. సుఖముభావమాత్రమే.

పవిత్రమైన తలంపులతోడనే సుఖమునొందుట శ్రేయము. నిన్నటి యాలింగనాదులంకితముగా లేదే దేహమున. వాటిని దలంచుచుండినగదా వాటియానందసుఖము స్థిరమగుట. అట్టితరి యీ దేహమునతని కర్పింపనేల. చిత్తమున నారాధించు భగవంతుని, ప్రకృతిని, కులాచారములను వదలి యస్థిరమగు దేహసౌఖ్యమునకు దాసులగుట నీతిగాదు. ప్రేమను సంకుచిత మొనర్చుటయా. నూతనబంధనములను స్వతంత్రించి కలిపించుకొనినవాని పరిణామ మెట్లుండునో. అయ్యో. మియ్యా ఎంతకాలమునుండి తనప్రాణము నర్పింప నున్నాడు. స్వజనులతోనుండి యాచారముల కనువుగ సంచరించుటకతని జేపట్టిన వీలుండునే. వానిని నిరసించడమైనది. భావికాలమెట్లుండునో! ఇవి యామెయాలోచనలు.

పది దాటినది. రోహిలాలందరు గుడారములను జేరిరి. రహీంటుల్లాకూతు మన్వస్థవిని పరగునబోయి యామెమంచముప్రక్క జదికిలబడెను. అతడు రోజాబీశరీరమును దాకుటతోడనే రోజాబీ కండ్లనువిప్పి తండ్రినిజూచి లేచికూర్చుండెను. రహీంటుల్లా యశ్రుపూరిత నయనములగాంచి యామెకూడ దుఃఖించెను, రహీంటుల్లా కన్నీరుదుడుచుకొని "బిడ్డా! ఎప్పుడూ లేని ఈయవస్థయేమిటి? ఏమిటమ్మా నీబాధ? చెప్పుముతల్లీ చికిత్సచేతును. నీవుపడుకొనియుంటిన మాఉత్సాహము తగ్గును. నాజీవితమునకు నీవు దివ్యజ్యో

తివి. నీయస్వస్థత నామనస్సును కలతనొందించుచున్నది. తల్లీ! చెప్పుము. తలభారమా?" అనియడిగెను.

రోజాబీ, "బాబా! ఏమియు లేదు. కొంచం తల భారమనిపించింది. విశ్రాంతివల్ల తగ్గిపోయింది."

రహీంటుల్లా "నేటినుండి నీవు పైకి వెళ్ళవద్దు. నాశరీరంలో దారుఢ్యముండినంత కాలం నిన్ను కాలు కదప నీయను."

రోజాబీ, "దాదా! అదిచూతాం. ఈయస్వస్థత నీకంత బాధ కలుగ చేయుటతప్పు. నీదుఃఖము నాకుదుఃఖమున కలిగింపదా. నీశ్రమ నాకుశ్రమను కలిగించదా."

ఇట్లు వారు సంభాషించుచుండ మియ్యా మున్నగు వారా గుడారద్వారమువద్దకువచ్చి యామెకుశలతనుగూర్చి ప్రశ్నింపసాగిరి. మియ్యా దీనవదనుడై యుండెను. రహీంటుల్లా వారిప్రశ్నల కుచితయుత్తరముల నిచ్చుచుండ రోజాబీ లేచి బయటకువచ్చెను. ఆమె యెప్పటియుత్సాహమును దెచ్చుకొని వారితో పలువిధముల సంభాషించుచుండెను.

జానీబీ ప్రసంగవశమున ముసలి వృత్తాంతమును దక్కన రోహిలాలకు వినిపింపుచు, "ఆఅమ్మి అక్కకోసం వచ్చినట్లు ఆమెసమీపానికి వస్తూవుంటే పిల్లలు అల్లరిచేయుడం మొదలెట్టారు. అంత అక్క వారిని తప్పించుకొనిపోయి

మునలిదానిని మేనూడుచుండిన తావునకు తెచ్చి నిలిపింది. మునలిది యేడవడం ప్రారంభించింది. అక్క ఆటనూని తల భారంగావుంద"ని వచ్చివేసింది. ఆషాబీ యీవృత్తాంతము నందుకొని "నిన్నకూడావచ్చింది. అదిపిచ్చిది. మానూర్జా నువు నవ్వకావాఅని రోజాబీ అడిగింద"ని పలుకసాగెను. ఆవిషయములందరికి వినోదమును గలిగించెను. రహీంటుల్లా తలవాల్చి దీర్ఘవిచారమున బడెను.

౧౨

శ్రీరామం యుల్లానమున కంతములేదు. ఆనాటి యుత్సాహమతని యందెన్నడును బొడగట్టలేదు. ఆయుల్లాన మున నతనిదైనికచర్యల నతడు మరచిపోవుచుండెను. ముకు రము ముందతడు గూర్చుని యెన్నిసారులో కాల్పింగును నవరించెను. కాలకృత్యములను దీర్చుకొనునపుడు స్నాన మొనర్చునపుడు భుజించునపుడు నతడు జూపిన తొందర నవ్వు పుట్టించును. కాని వాటిని ముగించి కుర్చీపై గూర్చునిన నద్దమే శరణ్యమగుచుండెను. వేషమును నవరించుకొనుటలో వెళ్ళబుచ్చిన కాలమధికము. ఇంకను దనివిదీరుటలేదు. ఎంత యో నూతనఫక్కిని నవరించుచుండెను.

వీధిలో నెవరో తనకై బిలచినట్లయిన నతని యుల్లా నమునకు కొంచముగ భంగము గలిగెను. పిలచినవారు మూరాడకున్న బోయెదరని యూరకుండెను. మూరాడకుం

డిన కొలది పైనుండి పిలుపు వినబడుచునే యుండెను. శ్రీరామంతండ్రి యాపిలుపుల కులికిపడి వీధిలోనికి మెల్లగ బోయి యెవరని యడుగ నాయాగంతకుడు, "మీ శ్రీరామం లేడండీ, వక్కసారి నేవచ్చానని చెప్పండ"ని కోరెను శ్రీరామంతండ్రి సుబ్బయ్యశాస్త్రి. అతడు "నేనంటే ఎవరు నాయనా?" అనియడుగ రెండవయాతడు "శర్మను కూనపల్లివారి పిల్లాడినండ''ని సమాధానమిచ్చెను.

సుబ్బయ్యశాస్త్రి "కూనపల్లివారి పిల్లవాడివటయ్యా! మీచెల్లికి పెళ్ళయిందా."

శర్మ "అయిందండి."

సుబ్బయ్యశాస్త్రి "సంబంధం ఎక్కడిది"

ఈప్రశ్నలకు శర్మ విసుగుజెందుచుండెను. లోన శ్రీరామం సంతసించుచుండెను. శర్మ "మాడుగులండీ! శ్రీరామం ఉన్నాడాండి. ఉంటే వక్కసారిపిలవండి."

సుబ్బయ్యశాస్త్రి "ఉన్నాడ"ని చెప్పి లోనికేగెను. కుమారునకు శర్మరాక నెరిగించెను. శ్రీరామం వీధిలోనికి వెళ్ళకదప్పినదికాదు. అతడు వీధివసారాలోనికి వచ్చుసరికి శర్మ "ఏమిరా! గొంతుకుపోయింది పిలిచేసరికి. అంతముస్తాబులో వున్నావేమ''ని యడిగెను.

శ్రీరామం "భోంచేసినతరువాత కునుకువచ్చింది."

శర్మ "కునుకైతే పిలుపువినబడదూ? ముస్తాబులో వున్నావు వినిపించుకోలేదు. ఎక్కడికైనా ప్రయాణమా!''

శ్రీరామం "ప్రియాణమే."
శర్మ "ఎప్పుడువస్తావు"
శ్రీరామం "అది చెప్పలేను."
శర్మ "ఒరే సినేమాకొస్తానని యెక్కడికిరా యీ దూకేయడఁ?"

శ్రీరామం "కారణంలేందీ ఎప్పుడుతప్పించుకున్నా? బహుశా రేపొస్తా. నేవచ్చినరోజు మనం అందరమూ కలిసి వెళ్దాం."

శర్మ "సాయంత్రిం వుండవైతే, సరే వెళ్ళిరా. నే వెళ్ళివస్తాను"

శర్మ వెడలిపోయెను. శ్రీరామం బాంకునకు సంత సించెను. ఎట్టి మహాదర్శకము లున్నను దప్పుదారిని సంచ రించుట తటస్థించెనేని యొకటి రెండు తప్పులుగ బెరగు చుండును. తన బాంకునకు శ్రీరామ ముపొంగుటలో నాశ్చర్యము లేదు.

శ్రీరామం సినేమాకుబోయి మాట దప్పుట కిచ్ఛ గించలేదు. లోనికిబోయి యతడు మరింత యుత్సాహముతో కాలమునకై నిరీక్షించుచుండెను. మిత్రులను దప్పించు కొనెను. కార్యసాఫల్యత కెట్టియాటంక ముండదు.

అట దోటలో రామయ్య మరియొక ధోరణిలో నుండెను. "శ్రీరామమూర్తి నిన్నరాత్రి రాలేదు. పోతూ

రేపొస్తానని ఆపిల్లతో చెప్పాడు. నాకుమళ్ళీ కబురు లేదు. నే నెందు కీయింటికి రానిస్తాను. ఈరాత్రి ఆశాభంగం అయితే రేపురాడు. రేపు ఇంకో ఎత్తు ఎత్తవచ్చు. ఆమాయలాడు రోజాను మోసం చేస్తున్నాడు. ఊళ్ళో భోగం అమ్మాయిలు సరిపోలేదు బాబుకు. పెళ్ళికూడా చేసికుంటాడుకదా ఎందుకీ మాయ. చూస్తా, మళ్ళీ ఆపిల్ల నెలా తాకుతాడో. "అని వాపోయ జొచ్చెను. అది మొదలు రామయ్య బీటి వైపునకు బోయి గోజాబీకొరకు నిరీక్షించుచుండెను. రోజాబీ గుడారములదాటి వచ్చునట్లులేదు. ఎంత వేచియుండినను ఫలితము లేదని యతడు నిరుత్సాహమునొంది కుటీరమును జేరెను.

ఉదయించిన భాను డస్తమింపకపోడు. శరీర పరిశ్రమకు పీగినవారును బుద్ధి నుపయోగించి పనిజేయుటలో నలసి యాలోచన దోచక వేసరియో వేతనమునకు దగిన పనిని జేసితిమి చాలునింకయనియో నియమిత కాలము మీరిన దనియో పనులను ముగించు వారును గృహోన్ముఖులగు చుండిరి. బాలు రాటలలో నిమగ్నులయిరి. క్రమముగ నాకసము రుధిర కాంతులతో నిండుకొనెను. మరల నది నీలిమను ధరించెను. చంద్రుడు బాగ్దిశను బైడిచక్రమువలె లేచుచుండెను. శ్రీరామము భోజనమును ముగించి యారామమునకు బ్రయాణమాయెను. ఎంతయో దీర్ఘ యాన

మొనర్చువాని పగిది యతడాయాస పడుచుండెను. దైవము కాలికి మనోవేగముంచిన బాగుండెడిది. ఎంత త్వరగ నడచినను నారామము దూరముగ గన్పట్టుచుండెను. వెన్నెల యాతని కాహ్వానము నిచ్చుచుండినను శ్రీరామం దాని బాటింపలేదు. ఎట్టకేలకు శ్రీరామం ఆరామమును జొచ్చెను ముందురాత్రి రోజాబీని గలసుకొనిన ప్రదేశమును సమీపించుసరికతని కందెవ్వరోయుండుట గాన్పించెను. అందిరువురు మాటాడుచుండిరి. శ్రీరామం చప్పుడుచేయక నొక చెట్టు వెనుక నిలచి వారిసంభాషణ విన మొదలిడెను. రోజాబీ యెవరితోనైన నున్నదేమో, ఆమె యా యిరువురిలో నొకతెయైన ముందురాత్రి మాటలు మరచియున్నదేమో, లేక తనను మోసగించుటకట్టి రంగమును గల్పించినదో యనియెడి సంశయ మతని మనమును బీడింపసాగెను. ఆయిరువురు నీడనుండుటచే శ్రీరామం వారిని గుర్తించలేదు. ఇంతలో వారిలోనొకరు "సాయబయ్యా! ఏవూళ్ళోనైనా ఇన్నాళ్ళుంటే కిట్టుబాటుంటిందా" యని రెండవవ్యక్తినడుగుచుండెను. రెండవవ్యక్తి యా మొదటివ్యక్తి పలుకులకు సంతోషించనివానివలె మౌనమూనియుండెను. మొదట వ్యక్తి యట్టివానితో మాటాడుట యెందుకని వెనుకకు బోయెను. ఆపోవునపుడు శ్రీరామం వానిని రామయ్యగ గుర్తించెను. రెండవవ్యక్తి కూడ నాచెట్టునువిడిచి బీటి

లోనికిబోయెను. ఆవ్యక్తి రోజాబీ కాదని యెరిగి శ్రీరామం భవనమునకు బోయెను. రామయ్యా యింకను భవనమును జేరకపూర్వమే శ్రీరామం భవనమును జేరుకొనెను. అతను హాలు ద్వారమును సమీపించి తలుపును దోయుసరికది తెరువబడెను. టార్చిలయిటు సహాయమున నతడు లోనికి బోయి హాలంతయు జూచి రామయ్యా మంచివాడని ధన్యవాద 'ముఅర్పెను. మరల నతడు బయటకువచ్చి రోజాబీకై నిరీక్షించుచుండెను. ఇంతలో రామయ్యా యచటికి వచ్చి శ్రీరామమునుజూచి యాశ్చర్యపడెను. రామయ్యాను జూచి శ్రీరామం "రామయ్యా! నీవు చాలవిశ్వాసపాత్రుడివి. ఒక స్నేహితునకు ఈ యిల్లు కావలసి నిన్ను శ్రమపెట్టా. నీవు వెళ్ళు. అవసరమైతే పిలుస్తాన''ని పలికెను. రామయ్యా హాలుతలుపు తీసియుండుట జూచెను. ఆరాత్రి శ్రీరామమును భవనములోనికి రాకుండ జేయదలపెట్టిన నతడు తాళమువైచుట మరచిపోయెను. ముందురాత్రి నుండియు నా తలుపట్లేయుండెను. ఇపుడేమి చేయగలడు రామయ్యా? శ్రీరామంతో పొమ్మని చెప్పగలడా? చెప్పలేకుండెను. శ్రీరామం స్నేహితు డొస్తాడని చెప్పినది కల్లయని యతనికి దెలుసును. అయిన నేమనగలడు. ఏమనుటకును నోరాడుట లేదు. దైవము తనకు ప్రతికూలము వహించి యుండెననెడి భావముతో రామయ్యా మూగయై శ్రీరామం వెళ్ళిపొమ్మనగనే కుటీరమువైపునకు బోయెను.

రాత్రి తొమ్మిదిమైనది. రోజాబీ మెల్లగ నాభవనమును సమీపించుచుండెను. ఆమె యెంత మెల్లగ నడచుచుండినను ఎండినయాకులపై పాదములు బడునపుడా నిశ్చలసమయమున ధ్వని బాగుగ వినబడుచుండెను. శ్రీరామంయాశ హెచ్చాయెను. ఇంత నాచప్పు డాగిపోయెను. శ్రీరామమునకు వాయుదేవునిపై కోపముకలిగెను. వాయువుచలనమున నాకులకు ధ్వనిగలుగజేసి యతనిని భ్రమింపజేయుచుండెనని యతడుకోపించెను. కాని మరల ధ్వని వినిపించెను. అది పదధ్వని. శ్రీరామమునకు మరలనాశకలిగెను. ఆయాశఫలించిన దనునటుల రోజాబీ యతని దృక్పదమునబడెను. నిర్మలాకాశమున రేరాజెల్లువెలగుచుండెనో నట్లారోజాబీ యాధవళ చంద్రికాంతులందు విరాజిల్లుచుండెను. ఆమెనుజూచి శ్రీరామం వసారపైనుండిదిగి యామెకాహ్వానమొసంగుచు ముందునకుబోయి యామెదక్షిణహస్తమును గ్రహించి యాభవనమునకు భవనపుహాలులోనికి దీసికొనివెళ్ళెను. హాలును కరదీపికతో బ్రకాసింపజేయుచు శ్రీరామం రోజాబీని సోఫావద్దకు గొనిపోయెను. రోజాబీ యప్పటివర కట్టియాటంకముచు జేయులేనిస్థితియం దుంశినను "నన్ను క్షమింపుడు. నాకు భయముకలుగుచున్నది. ఈ సుఖము స్థిరముకాదు. రేపుమేము వెళ్ళిపోవుచున్నాం. మాతండ్రిఆజ్ఞఅది. ఆసంగతిచెప్పటకు నేవచ్చితిన"ని బలుక

సాహసించెను. శ్రీరాఘుం మరునాటి వారిప్రయాణమునకు వగచెను. కాని మరునాటిప్రసంశ యపుడేలజర్చించుటయని యామెతో, "నీకేమియు భయము లేదు. చల్లకొచ్చి ముంత దాచినట్లున్నది నీసంగతి. కోమలీ! ఈనిర్జనప్రదేశమున మన ప్రణయాభివృద్ధికి పాటుబడుటలెస్స. శరీరమే స్థిరము కాదను నపుడు సుఖముస్థిరమని ఎట్లుచెప్పగలను. కాని ఇట్టిసుఖమీా ప్రపంచంలో అపేక్షించుట తప్పులేనిది. ఈనశ్వర దేహము నకు మనము సుఖముగూర్చుటయే చేయకలిగిన మేలు. సుఖ జీవనమే ఐహికజీవితమును నడుపుయంత్రము. దానికి పునాది కూడ. ఈకాలమును వ్యర్థపుచ్చకుమ"ని యామెభుజవల్లి కలనంటి సిరమునుముద్దాడి రోజాబీని మెల్లగ సోఫాపై గూర్చుండబెట్టి యతడామెప్రక్కగ గూర్చొనెను. అతడు కూడ గూర్చునినవెంటనే శ్రీరామం రోజాబీని తనబాహు వల్లికలోనికి దీసికొని యాలింగన మొనర్చుచుండునంతలో నొకకేక వేసి శ్రీరామంముందున కొరిగెను. ఆకేకకు భీతిల్లి రోజాబీ లేవకున్న నామెముందుగ క్రిందబడవలసినదే. శ్రీరామం బోరగిలపడిపోయెను. కరదీప మారిపోయియుం డెను. రోజాబీకేమియు బోధపడలేదు. ఆమె దీపమునకై దడవి దానినిగ్రహించి వెలిగించిచూచుసరికి శ్రీరామం వెన్నునుండి రక్తముధారాపాతముగ స్రవించు చుండెను. శ్రీరామం చైతన్యసూన్యుడైయుండెను. అతనికి స్మృతిలేదు,

ఎంతధైర్యవతియైననేమి యాదృశ్య మొంటిగయున్న నా మెకు భీతిగలిగించెను. ఆమెకోమలిహృదయమునది ముంచి వైచెను. కాని యతనిబాధ మూలుగు రక్తస్రవింతి, యవియే మరల నామెధైర్యమునకు గారణమయ్యెను. రోజాబీ రక్తమునుదుడిచి యతనిని సోఫాపైకిజేర్చి గాయమునకొక విధముగుకట్టు గట్టెను. తరువాత నేమిచేయవలెననెడి ప్రశ్న లేచెను. ఆమెకు తనగుడారమును జేరుటయే యుత్తమమని యంతరాత్మ బోధించునట్లాయెను. సర్వాంగములు మనము కూడ మిగులభారమువహింప నామెగుడారవాటి కనతి ప్రయాసమునజేరెను. త్రోవలో ప్రతిమొక్కయు ప్రతివృక్షమును మూల్గుచున్నటుల నామెకుదోచెసిది. స్వగుడారమును జేరినదికాని నిదురబోవుటయెట్లు. నిదురవచ్చునా? ఒకప్రాణి తనమూలమున గాయపడినే. అహా! దైవమెంత చతురుడు. తనకొక పెనుయనుభవము నాపిన్నవయసుననే గూర్చెను. ఎండమావులవంటి దేహసుఖమున కలడాసింప నేల, తానాదినమున బోవకుండిన మేలుకలిగెనిదే. మానవ బుద్ధి చంచలము, చపలత, దానిస్వభావము. ప్రేమామృతమున గ్రోలజూపి కత్తుకను కోయనమకట్టితివా దైవమా! అట్టియేకాంతస్థలమున కితరులొచ్చుట యెట్లుపొనగెను, ప్రేమవిషయమున శతృత్వముండునా? లేక శ్రీరామం పూర్వశతృవులెవరైన నతనిని వెన్నంటియుండి యట్టిఘోర

కార్య మొనర్చిరా? తాను నిర్దోషి. కాదు దోషియే. ఏల విశ్వమునుమరచి బంధుజనులనుమరచి యొకయపరిచయునితో పరిచయ మొనర్చుకొనెను? సర్వ మంధకారముగ దోచు చున్నది. పవిత్రప్రేమకు విషాదాంతమే ఫలితముకావోలు. నిజము, కథలట్లనే చాటుచున్నవి. అందు స్వాయముగ స్వతంత్రించి చేసినపని కదియేఫలితము. ఇకనీజీవితమీ యంధకారమున బోవలసినదే. మానవజీవితమున నెన్నియొడిదుడుకులు. ఇట్లుదుఃఖించుచు రోజాబీ మంచముపై మేనుజేర్చియు నిదుర లేక గుందుచుండెను.

రోజాబీ భవనమునువీడి చనినతరువాత రామయ్య వెనుకవసారాలోనుంచి కుటీరమునకుబోయెను. కాని యతనికి యాందోళన మెండగుటచే రేయంతయు నిదుర లేక నుషఃకాలముననే భవనమునుజేరెను.

విహంగ వందిమాగదులు నభోవీధిని సందడి జేయ సాగెను. రేరాజు మంచితనమున కతనిని లోకువజేసి దుండగము లాచరించినవారిని దండించుటకోయనునట్లు సూర్యుడు ప్రగడపుకాంతులతో నెగయుచుండెను.

రామయ్య భవనమును జేరెనుగాని యేమిచేయవలెనని యాలోచింప మొదలిడెను. కరుణాక్రోధరసము లతనితో బోట్లాడుచుండెను. ప్రపంచములోగాని ప్రాపంచకవిషయములతోగాని పెక్కుసంబంధములు లేక నిర్జనప్రదేశమందు

సంతృప్తిమనస్కుఁడై ప్రకృతిలావణ్యతమధ్య జీవించు రామయ్య స్వభావమున నీతిబాహ్యమగు క్రోధరసముండుట యసంభవము. తాత్కాలికముగ గుపితుఁడయినను నతని యందాక్రోశము క్షణికమగుచుండెను. కావున కరుణరస పరిపూర్ణుఁడగు రామయ్య శ్రీరామమునకు సహాయముజేయ తీర్మానించుకొనెను. గతరాత్రి యేలజేయలేదని యనుమానము వచ్చును. రామయ్యమనస్థాయి యేమిటో కనుగొనవలదా? ఒకఘోరమగుపని తలవనితలంపుగ గండెదుట జరిగిన నట్టి వారికి భయముకలుగుట సహజము; ఏపనిజేయవలెనో దోచ కుండుట సహజము.

రామయ్య హోటలులోనికిబోయి శ్రీరామమును సమీపించెను. శ్రీరామం మెల్లగ మూల్గుచుండెను కాని యతని కండ్లు మూతలుబడియుండెను. మూల్గునందు నిస్రాణ స్ఫురించుచుండెను. రామయ్య యతనిదేహమును ముట్టి చూచెను. శ్రీరామం నగముకండ్లనువిప్పి మంచినీటికై సంజ్ఞ జేసెను. రామయ్య పరుగున దనకుటీరమునుండి యుదకమునుదెచ్చి యతసినోటికందింప శ్రీరామం బహుశ్రమతో గొంతద్రావి మరల కండ్లను మూసుకొనెను. రామయ్య శ్రీరామం తలిదండ్రులకా యుదంతమెరిగింప బయన మమ్యెను.

సాధువా సమయమున సాలలోనుండెను. కాని యతనిదర్శనమైన గాంపకయే రామయ్య వెడలెను.

౧౩

రామయ్య తెలిపినవార్త విని శ్రీరామం తండ్రి యింకఁ గొందరు స్నేహితులు భవనమునకు త్వరితముగ వచ్చిరి. శ్రీరామం ఆసరికి కలువరింతలలో నుండెను. శరీరమందలి బాధకు విరుద్ధముగ నతని నోటినుండి ప్రియవాక్కులు బయల్వెడలుచుండెను. మానవప్రవృత్తి యట్టిది. అతని కలువరింత లంతలో నాగెను. సుబ్బయ్యశ్రేష్ఠి యాందోళిత హృదయముతో నతనిఁజేరి శరీరమామూలాగ్రముగ దడవి క్రిందిరక్తపు మడుగును జూచి యాదృశ్యమును జూడలేక మూర్ఛనొందెను. డాక్టరుకూడ నాసమయమున కచ్చటికి వచ్చియుండుటచే సుబ్బయ్యశ్రేష్ఠిని వెనుక వసారాలోనికి గొంపోయి చికిత్సయొనర్చి శ్రీరామమును పరీక్షించెను. జ్వరము మిక్కుటముగ గాయుచుండెను. శ్రీరామం చాల బలహీనస్థితి యందుండెను. డాక్టరతని గాయమునకు గట్టబడిన కట్టునువిప్పి గాయమునుపరీక్షించి "ఈకట్టెవరుకట్టారో? ఈకట్టే లేకుండిన ఈసరికి శ్రీరామంకు ప్రాణాపాయంకలిగేదే"నని పలికెను. గాయము గాఢమైనదే. దానికుచిత చికిత్సజేయుచు డాక్టరుండ పోలీసు సబ్ ఇన్స్పెక్టరిరువురు భటులతో నాతని సమీపించెను. స్త్రీలు కొందరుకూడ నా చుట్టుజేరి యార్తనాద మొనర్చుచుండిరి. డాక్టరు వారించినను వారాగనందున నతడు "ఇప్పుడు మీరేడిస్తే

ఇతనికి తెలివివస్తుంది. గుండెవగిలి ప్రాణము మీదికి వస్తుంది. లేచిపొండ"ని పలుక వారు మెల్లగ దూరమునకు బోయిరి.

సబ్ ఇన్స్పెక్టరుకూడా డాక్టరను మాటాడించుటకు సంశయించి వెలుపలి వసారోలోనికి వచ్చి యచటి వారిని బ్రశ్నింప మొదలిడెను. స॥ ఇ॥ ఈభవనమునకు కాపలా ఎవడు?"ఒకరు "రామయ్యా అనే గొల్లాడు."

స॥ ఇ॥ "వాడిని తీసుకురండి."

అందుపై నొకడు రామయ్య నతనియెదుట బెట్టెను.

స॥ ఇ॥ నీవేనా రామయ్యావు?"

రామయ్యా "అవునండి బాబూ"

స॥ ఇ॥ "ఈ కథేమిటో చెప్పు. ఎప్పుడుజరిగింది ? ఏలాగజరిగింది?"

రామయ్యా "నాకేమీ తెలీదుబాబూ! ఉదయం చూసేసరికి పెద్దకుర్చీలో పడున్నారు."

స॥ ఇ॥ "ముందునుంచి మొదలెట్టవోయ్."

ఇంతలో డాక్టరు శ్రీరామం గాయమునకు గట్టుకట్టి పై వసారాలోనికి వచ్చెను. అతనినిజూచి సబ్ ఇన్స్పెక్టరు, "డాక్టరుగారూ! గాయం ఏపాటిది. ఎంతసేపై తగిలివుంటుంద"ని యడిగెను.

డాక్టరు: "వెన్నుమీద కొంచం ఎడమప్రక్కగా వుంది. బలమైనదే. పది పన్నెండు గంటలయి వుంటుంది గాయంతగిలి."

స॥ ఇ॥ "ప్రాణభయం వుండదనుకుంటా. ఏదైనా వాడి అయిన కత్తితో పొడిచినట్టుందా లేక నరకపోతే చీరుకున్నట్టుందా.?"

డాక్టరు, "మొలకువుగా నున్నాడు. ప్రాణభయం లేదు వాడిమొనగలదానితో పొడిచినట్లేవుంది."

సుబ్బయ్యశేష్ఠి డాక్టరును సమీపించి "బాబూ! ఇంటికి తీసుకొని పోతాం ఏం శలవు" అని యడిగెను.

డాక్టరు, "ముందు వేడికాఫీయిమ్మన్నా. తెచ్చారా! ఈవేళ అతన్ని కదపడానికి వీలులేదు."

సుబ్బయ్యశేష్ఠి కాఫీ ప్రయత్నములో బడెను. డాక్టరు మరల వచ్చెదనని వెళ్ళిపోయెను.

స॥ ఇ॥ "రామయ్యా! ప్రారంభించు."

రామయ్య, "రేత్రి రెండుమూడు గడియలికి ఆబా బొచ్చాడు. బంగాళాలో బనచేయడానికి స్నేయితు డొస్తాడు. నీవు పడుకో అవసరమైతే పిలుస్తానన్నారండి. నేపోయా. ఎవరొచ్చారో తెల్దు. నన్నెవరూపిలవలేదు. ఉదయంచూస్తే ఆబాబు పడుకున్నాడండి."

స॥ ఇ॥ నీవెచటికిపోయావు? నీవిచట పడుకొనవా?"

రామయ్య 'లేదండి నాగుడిసిలో పరుంటానండి"

స॥ ఇ॥ "అదెక్కడ?"

రామయ్య "ఆతోటలో వకమ్మూల నుందండి"

స॥ ఇ॥ నీకేదీ కేకైనా వినిపించలేదూ?"

రామయ్య "అదేమోనండి బాబూ!"

సబ్ ఇన్స్పెక్టరటుతరువాత శ్రీరామును గాయము నకు గట్టబడిన గుడ్డను దెప్పించి "ఈబట్ట ఎవరిది"ని రామయ్య నడిగెను. అందులకు రామయ్య "నాకు తెలీదండి" అని జవాబు చెప్పెను. స॥ ఇ॥ "ఛీ! గాడిదా! దేనికీ సరైన జవాబు చెప్పడంలేదు. కబడ్దార్" పోలీసువారు శ్రీరాముని దగ్గరకుబోయి యతడింకను నీరసముగ నుండుటజూచి బీటి వైపునకు బోయిరి.

రోహిలాలు సాయంత్రి మాపట్టణమును విడిచుటకు బ్రియత్నములు సేయుచుండిరి. పోలీసువారు వారిని సమీ పించి వారి ప్రియత్నములను జూచిరి.

స॥ ఇ॥ "ప్రియాణాం కడుతున్నారా"

రహీంటుల్లా "అవును"

స॥ ఇ॥ "ఈవేళే ప్రియాణసన్నాహం చేయడమేం?"

రహీం "మాఁరోరోజేమిటి? కిట్టుబాటు కాకుంతే మరోతావునకు పోతాం."

స॥ ఇ॥ "మీారందరూ వకసారి ఇక్కడికి వచ్చి నిలు చోండి."

రహీంటుల్లా సంజ్ఞజేయ రోహిలాలందరు పోలీసుల యెదుట నిలువబడిరి.

స॥ ఇ॥ నిన్నరాత్రి మీరందరూ బీడుదాటి యచటి కైనా వెళ్ళేరా?"

"వెళ్ళలేదు."

సబ్ ఇన్స్పెక్ట రందరినీ జూచుచుండెను. రోజాబీవైపు జూచునపు డాయంగన సౌందర్యమతని ముగ్ధు నొనర్చెను. ఆమె యుత్తరీయమును జూచునపు డతని కేదియో దోచెను కాని యతని కది యర్థముకాలేదు. సబ్ ఇన్స్పెక్టరు "అరాచకం ప్రారంభించారు. నాఆజ్ఞ అయేవరకూ మీరు కదల వద్దు. ప్రయాణసన్నాహం మానండ"ని యాజ్ఞనిడెను.

రహీంటుల్లా "మావారెవరూ ఏ అరాచకం చేయ లేదు. ఎంత సత్ప్రవర్తన చూపినా మామీద అనుమానం చూపడం యీాకు నైజమైపోయింది అది మాకర్మ."

స ఇ॥ "వాగకు. సత్ప్రవర్తన! సమీాపంలో నేరం జరిగింది. ఏం తెలీదని నంగనాచిలా కబుర్లు చెపుతున్నావు" తరువాత పోలీసువారు నడచిపోయిరి. పోవునపుడు మరల నాదినము ప్రయాణ మవుటకు వీలులేదని జెప్పి వెడలి పోయెను. త్రోవలో నాలోచించినపుడు "శ్రీరామం గడి యారం గొలుసు ఉంగరం అన్నీ యథారీతిగా వున్నాయే. రోహిణాలు నేరంచేసారనడానికి సావకాశంలేదే" అని తర్కించుకొనుచుండెను.

రోహిలాలకుగూడ శ్రీరామం గాయపడుటసంగతి తెలిసెను. భవనమునుండి వారి యుత్సాహోద్యమలను జూచి రోజాబీ శ్రీరామం సుఖముగనుండెనని భావించినది. "నా వల్ల ఒకప్రాణికి కలిగిన అపాయమును తప్పించితివి భగవంతుడా! నేను కృతజ్ఞురాలను," అని రోజాబీ మానసికమున భగవంతునర్చించుచుండెను. కాని యామెముఖము కళావిహీనమైయున్నది. ఆవరకు గండ్లుమూయుసరికి యపూర్వ సందర్శనములామె కాంచుచుండెను. ఎవరో ఆమెనుబంధించి గొంపోవు నట్లొకపరి యామెకు గోచరమాయెను. ఆమె చుట్టునుజూచి హసించినది. కాని యానవ్వులో బూర్వపు కళ కానరాదు. ఆమె కష్టమనిపించినను కండ్లను మూయ సాహసించుటలేదు. తక్కినవారితో గలసి పనిజేయు నుద్యమించెనుగాని యామె కేపనియందును రుచి కలుగలేదు.

రహింటుల్లా యామె యస్వాభావికచర్యలను దిలకించి తిలకించి యేమియుదోచక నామెను సమీపించి "బిడ్డా! నీశరీరమున నేదియైన అస్వస్థత అంకురించినదా? ఏల నీమోము వాడియున్నది? చెప్పుమమ్మా! నాకు కష్టమనిపించుచున్నద"ని దీనముగ నడిగెను. రోజాబీ "బాబా! నాకేజబ్బును లేదు. నీవు విచారింపకుము "ఇంక నేమియో జెప్పదలచియు సాహసింపలేకపోయెను.

రహీంటుల్లా "ఒక్కపాట బాడుము. నీ చిన్నిచేతులతో నాశిరోజములను సవరింపుము."

రోజాబీ యతనిని సమీపించి యతనిశిరోజములను సవరించుచుండెను. కాని పాటపాడవలెననెడి యిచ్ఛపొడమకుండుటచే పాట బాడలేదు. ఇంతలో పోలీసువారు వచ్చుట తటస్థించినది.

వారు వెడలినతరువాత రోజాబీ తండ్రిని బిలచి "బాబా! గుడారములోని కొకసారిరమ్మ"ని కోరెను రహీంటుల్లా యందుల కంగీకరించి యామెవెంట గుడారములోనికి బోయెను. వారు లోనికి బోయినంతనే రోజాబీ రహీంటుల్లా పాదములకొరగి "బాబా! నన్ను క్షమింపుము. నావల్ల మీకెట్టి కష్టము కలుగునో" నని యేడ్వనారంభించెను. రహీంటుల్లా కది యెంతయో కష్టమనిపించెను. ఆమెకీర్తి, ఋజువర్తనము, ఆనందము, రహీంటుల్లా కానందదాయకములు. ఆనాటి యామె యధీరత నాతడెన్నడు గని యెరుగడు. క్షమించుట కామెయందెట్టి తప్పుండునో యతడూహింపలేకపోయెను. అతడు కూతును లేవనెత్తి యొక్కమారాలింగనమొసర్చి యామె శిరోజములను జక్కజేయుచు "తల్లీ! నిన్నుక్షమించుటకు నీ వేనేరమును చేసియుండవని నా విశ్వాసము. నీ మనసులోనున్నది చెప్పి నీభారమును తగ్గించుకొనుమమ్మా! నీయందు తప్పున్ననూ నిన్నుపూర్తిగ క్షమింతును. క్షోభపడక"ని పలికెను.

రోజాబీ శ్రీరామమును జూచినదిమొదలు వారి ప్రేమ గాధను జెప్పుచు "తండ్రీ! ఒక సుందరమూర్తిని నే ప్రేమించితిని. నే భౌతికసుఖ మపేక్షించలేదు. నా తొలివలపు పరిణామమది. మనమీ సాయంకాలం ఈపట్టణం విడిచిపోవనున్నామని యతనితో చెప్పుటకు నేనా బంగాళాకు వెళ్తిని. నన్నాతడెంతయో చెప్పి యాబంగాళాలోనికి తీసికొని వెళ్లెను సోఫాపై కూర్చుంటిమి. కెవ్వున కేక వేసి యతడు నేలపై కొరిగెను. ఎవరు పొడిచిరో కనబడలేను. అప్పుడు హాలులో చీకటిగనుండెను. దీపముకొరకై వెదికితిని. అది దొరకిన తరువాత చూడగా నతడు గాయుబడుట కంటిని. అతనికి కట్టుకట్టితిని, సోఫాపై పరుండబెట్టితిని. అచటనిలువలేక వెళ్ళిపోయి వచ్చా. ఈసంగతంతయు నీదగ్గరకూడ దాచితిని. నన్ను క్షమింపుము. నీబిడ్డ జీవితమున జూపిన ఈకృతఘ్నతను మన్నింపుమ"ని వేడుకొనెను. ఆకథ నాలకించిన రహీంటుల్లా యొక్క మనస్సు పలువిధముల బోజొచ్చెను. ఒకపరి యతనికి గోపముకూడ వచ్చెను. కాని యాకోపము దిగమ్రింగి "బిడ్డా! నీవు నిర్దోషివి. కాని అపరిచయుని ప్రేమించుటలో ఉచితానుచితములను గుర్తింపలేకపోయితివ"ని పలికెను. రోజాబీ "బాబా! ఆత్మసాక్షిగనే పలుకుచున్నా. నన్నింతవరకు ఏవస్తువు ప్రత్యేక హెచ్చుగ నాకర్షింపలేదు. అతని ఆకారము నాహృదయమును ఛేదించెను

నావిశ్వాసము ననుసరించి అతనిని హృదయమున నారా
ధించి సుఖంచితిని. అదియే అతనికికూడ బోధించితిని.
అతను నాహృదయశాంతిు చలనమున కనువుగ తనప్రేమను
నాపై ఉంచుటయే నాకు పరమానందమనిపించెను. అంత
కంటె నేకాంక్షించునదిలేదు, నాకు ప్రాప్తించినదిలేదు.
నేనీ పట్టణమును విడువనుంటినని నాకు దుఃఖముకలుగలేదు.
కాని యతని పలుకులవలన నాకై వేచియుండి నే పోకున్న
వ్యధజెంది నే మోసగించితినని భావించుననెడి యూహ
కలుగ నట్టియూహ అతనికి కలుగకుండ చేయుటకు
మాత్రమే నే పోయితిని. దుర్దినములు వచ్చిన నేమి చేయు
దును. నానిష్కళంక ప్రేమ భగవానుడు సహించలేక
నాకండ్లయెదుటనే నాప్రేమైక వస్తువున శాపదవాటిల్ల
జేసెను. ఒకవిధముగ భగవంతునకు నే కృతజ్ఞురాలను.
నూతనాను భవములగు నన్నులోను చేయకుండ కాపాడెను
కాని ఆయననాకష్టమునుగాని నాసుఖమునుగాని నాతో నుం
చక నాచేసిన పనికి మీఅందరిని కష్టముల పాలుచేయునేమో
నని వెరపు కలుగుచున్నది. తండ్రీ! నన్ను క్షమింపుము.
ఈమారు పోలీసులొచ్చిన వారికీసంగతంతయు తెల్పెదను.
నన్ను రక్షించినను శిక్షించినను నేను సంసిద్ధనయ్యెదను."

రహీంటుల్లా, "నీవు విచారింపకు. బిడ్డా! నీమనసు
నాకు తెలుసును. నీవే నేరమును చేయలేదని నేపూర్తిగ

విశ్వసించితిని. కాని ఒకమాట, నేరంచేసినదెవరో తెలియకుండా నువ్వు సత్యము సత్యముగ పలికిననూ నీకు శిక్ష తప్పదు. ఏలన నీపై అనుమానంపోదు. కావున నీవు తొందరపడకు. అవసరమొస్తే చెప్పవచ్చును."

వారి సంభాషణ ముగిసెను. రహీంటుల్లా కూతురు దీవించి బయటకువచ్చెను. అతని వెన్నంటియే రోజాబీ కూడ వెలుపలికి వచ్చెను. ఆమె యిపుడు తేలికగనుండెను. ముఖమున కొంకింత కాంతి చేకూరెను.

౧౪

రామయ్య పోలీసువారి కఠపటి మాటలకు భయమొందెను. తలుపు తాళము నేయ మరచుట నంతముప్పు వాటిల్లినదని యతడు పరితపించుచుండెను. రోజాబీ యెట్టి భీతి నొందియుండెనో ఆమె కెట్టి యాపద పోలీసువారు కలుగ జేయుదురో యత డూహింపలేకుండెను. అతనికి రోజాబీని గురించి తలచినకొలది జాలి కలుగజొచ్చెను. ఆమె నావిషమ పరిస్థితులనుండి తప్పింప నుపాయము వెదక జొచ్చెను. శ్రీరామం గాయమునకు గట్టబడినగుడ్డ రోజాబీ యుత్తరీయములోని భాగమని యతనికి దెలుసును. పోలీసువారు దానిని గుర్తించి యేమిచేయుదురో?

రామయ్య సాధువున్న సాలకుబోయెను. సాధువు పచారుచేయుచుండెను. సాధువునకు నమస్కారమొనర్చి

రామయ్య "సాధుజీ.. మమ్ముల్ని రక్షించండి. పోలీసారు ఏం బాధ పెడతారో" నని పలికెను. సాధువు తిరుగుచునే "ఇది సమయంకాదు. వెళ్ళు. తప్పుచేయని వారికెట్టి దండనమూ ఉండదు. ధైర్యం పురుషలక్షణాం పొమ్మ"ని పలికెను. అందు కొంత కాఠిన్యతగలదు. వెనుకకు మరలి రామయ్య కుటీరమునకు బోయెను.

౧౬

పైడిసెట్టిగారి యింటికిగూడ శ్రీరామం గాయము దినినవార్త సకాలముననే ప్రాకినది. కల్యాణి యేడ్వనారంభించెను. శ్రీరామం యేమగునో అతని గాయమెంతటి దారుణమైనదో, ఆగాయమున కాతడెంత బాధనొందుచుండెనో యని కల్యాణి విచారించుచుండెను. మాణిక్యమామె ననేకవిధముల నూరడింపజూచెను కాని యామె శోకము నరికట్టలేకపోయెను. పైడిశెట్టిగారుకూడ కొంచము విచారించి భవనమునకు బయలుదేరిరి. వారివెంట మాణిక్యం బయలుదేరెను. కల్యాణంకూడ వారివెంటబడెను. కాని తండ్రి యామెను వారించెను.

మాణిక్యం యాలోచనలలో నత్యము పొడగట్టుచుండెను. శ్రీరామం స్వభావము నామె పూర్తిగ గ్రహించినది. బీటిలో రోహిలాలు విడిసియుండుట నామెకు దెలిసిన తరువాత నామె యూహా తప్పుటయెట్లు? రోహిలా

యువత్యై శ్రీరామం నీచప్రయత్నము చేసియుండుననియు నది విషమించి యుండుననియు నామె యూహ. కాని యూహ యామె మనమునుదాటి పైకిరాలేదు.

మాణిక్యం పైడిశెట్టిగార్లు భవనమునకు బోవునరికి సందడి చాలవరకు నడగినది. శ్రీరామంస్మృతికలిగియుండెను డాక్టరు చెప్పినమాటల నాలించి వారు మరల దమ గృహము నకు బోయిరి. కల్యాణి కతనికుశలవార్త దెలిపి యూరడించిరి.

భవనమును శ్రీరామం తల్లిదండ్రులు కుమారు నెట్టి ప్రశ్న వేయుటకు సాహసించ లేకుండిరి. వారేమన నేల దక్కినవారు గూడనట్లే. కొన్నిగంటలు గడచినవి. డాక్టరు మరలవచ్చి నాడిజూచి భయములేదని పలికి వెడలిపోయెను. భోజనమునకై యెవరిప్రయత్నమున వారుండిరి. "శర్మ యొక్కడే శ్రీరామం యొద్దనుండెను. అతడు మెల్లగ ఏమిరా ఈసాహసం. ఊరికని ఇక్కడికా వచ్చావు? మాతోసినేమా కొచ్చినా యీభాదతప్పేదే! ఏదో పిట్టకోసం వచ్చినట్టుంది. గెంతుగెంతావు కాలుజారింది. అది నిజమేనా" యని ప్రశ్నిం చెను. శ్రీరామం మౌనమును ధరించెను. శర్మ మౌనం అర్ధం అంగీకారం అన్నారు పెద్దలు. చెప్పు. వింటాము రామాన్ను." శ్రీరామం మాటాడలేదుకాని యతనిలో నాలోచన లెగయనారంభించెను. రోజాబీని తాను బలవంత ముగ దీసికొని సోఫాపై గూర్చుండబెట్టుటకు నామెయే

నేరమ్మును గావించియుండుననను సంశయము మొదటకలిగెను. అదినిజమగుచో కట్టుకట్టినదాతయెవరు? ఏమో! చేసిన నేరమును గప్పిపెట్టుటకు గోజాబీయే కట్టుకూడి కట్టియుండును. ఇది రెండవ సంశయము. ఘోరవిషారగము నాలింగన మొనర్చి నటుల నతడు భీతిజెందెను. గోజాబీ యభిమాన సాహసాదుల నెరిగియు నామెతో సరసమాడ నెంచిన తన బుద్ధిలేమికి యతడు సిగ్గుజెందెను. ఆగాధ నోరులకెట్లు చెప్పగలను?

సాయంత్రము మూడుగంటలగును. పోలీసు సబ్ ఇన్స్పెక్టరు మరల శ్రీరామంయొద్దకువచ్చెను. ఒకకుర్చీ సోఫాయొద్దకులాగుకొని "శ్రీరామం! రాత్రికథ చెప్పాల"ని యడిగెను. శ్రీరామం యూరకున్నకొలది యుద్యోగి తొందర జేయసాగెను. క్రొత్తకథ యల్లుదమన్న నేమియు తోచుట లేదు, కొనకు శ్రీరామం "నేనోచిన్న ప్రశ్న వేస్తా మీరు మీరు కోపగించుకోపోతే" నని పలికెను. స॥ ఇ॥ "కోపగించడమెందుకు, అడుగు."

శ్రీరామం "ఈవిషయంలో మీరు చేయి కలుగచేసికోపోతే మీకేదైన కీడుకలుగునా?"

స॥ ఇ॥ "మీకాంగ్రెసు వాదులరీతే ఇది?"

శ్రీరామం "కాంగ్రెసునకు దీనికి సంబంధంలేదు. కాని నా స్వవిషయంలో నేరంజరిగింది. ప్రవించాని కేహాని

చేయలేని వారు చేయనివారూ నేరం చేసివుంటారు. వారిని దండించడం నాకు సమ్మతంకాదు. అందుచే మిమ్మల్ని ఆప్రశ్న అడిగా."

స॥ ఇ॥ "ఇది సామాన్యనేరం కాదు. పై అధికారు లైనా దీనిని వదలిపెట్టరు. అంతవచ్చేటట్లు ఎంకుకుచేయాలి. అదీకాక, ఈవేళ ఈనేరమైంది, రేపు కూనీ అవుతుంది. అప్పుడో!"

శ్రీరామం "అదెన్నడుకాదు. నేనానేరస్తునిపై నెట్టి చర్య జరిగింప సమకట్టలేదు. అట్టి సమయములో మీారంతగా శ్రద్ధతీసికోవడం అవుసరంలేదు. ఇదివరకు మీాశ్రమకు వందనములు."

స॥ ఇ॥ "శ్రీరామం ఈవిషయమై పనిచేయకతప్పదు. నేరస్తుని కప్పివుచ్చదలచిన నేరం నీమీాదపడుతుందేమో?"

శ్రీరామం నిరుత్తరుడాయెను.

స॥ ఇ॥ "కట్టుకట్టిందెవరు? ఆబట్టఎవరిది? నీవు నేరస్తుని చూస్తే వానిపేరుచెప్పాలి లేకపోతే ఎవరిమీాదను అనుమానముందో చెప్పు."

శ్రీరామం కథ వినిపించెను. "నన్నుపొడచినవారిని చూడలేదు. కట్టెవరు కట్టిరో నాకుస్మృతి తప్పియున్న సమయమున జరిగినందున చెప్పలేను." అనికూడ బలికెను.

స॥ ఇ॥ "ఆగుడ్డనుగురించి చెప్పలేదు."

శ్రీరాములు "అదికూడా చెప్పలేను"

స॥ ఇ॥ "రోజాబీదై యుండునా?"

శ్రీరాములు "కావచ్చును ఆరాత్రిసమయమున నామె ధరించిన వస్త్రములను నేను పరిశీలించలేదు"

స॥ ఇ॥ "ఇంకొకప్రశ్న. ఈనేరం రోజాబీ చేసి వుండునా?"

శ్రీరాములు "ఏల చేయవలెను?"

సబ్ ఇన్స్పెక్టరుకు రోజాబీని జూచినపుడు కలిగిన యస్పష్టమగు నాలోచన నామె యుత్తరీయము విషయ మనియు దానికిని కట్టుగట్టిన గుడ్డకును సంబంధముండు ననియు నతడు భావించెను. అతడు లేచి రోహిలాల వాడకు బోయి "మీలో రోజాబీ ఎవరని" ప్రశ్నించెను. రోజాబీ ముందునకు వచ్చెను. ఆమెకు గుడ్డను జూపుచు "ఇదినీదేనా" అని సబ్ ఇన్స్పెక్టరు ప్రశ్నించెను.

రోజాబీ "అవును." రహింటుల్లా ప్రాణము లెగిరి పోయెను.

స॥ ఇ॥ దీని కీనెత్తురు మరక లెందుకయామో తెలుసునా?"

రోజాబీ "తెలుసును, గాయపడిన యువకునికొకనికి కట్టుకట్టితిని. అందుచే మరకలైనవి."

స॥ ఇ॥ "గాయపడుట ఎట్లు జరిగెను."

రోజాబీ "అది నాకు తెలియదు."

స॥ ఇ॥ "నీవు చెప్పక తప్పదు."

రోజాబీ "తెలియనిదానిని గురించి . నేనెట్లు చెప్ప గలను?"

పోలీసు యుద్యోగికి గోపమువచ్చెను. అతనికి రోజాబీ కోమలాంగములుగాని కోమలహృదయముగాని కన్పట్టలేదు. చేతినున్న బెత్తముతో నామెనొక దెబ్బకొట్టి "ఈసారిచెప్పు నీవు చేయకున్న మరెవ్వరు చేయుదురు? నేరం కప్పిపుచ్చ డానికి కట్టుకట్టావు అది పోల్చుకోలేమా?" అని గట్టిగ బలి కెను. అతడు కొట్టినదెబ్బకు రోజాబీ బాధ జూపలేదు, చలింప లేదు. తోడి రోహిలావారి నెత్తురుడికిపోయినది. వారి నామె వారించి "మేమేమి చెప్పినను మీరు నమ్మతలంచనపుడు మమ్మలను ప్రశ్నింప నౌసరమే లేదు. మీయిష్ట మొచ్చిన రీతి చేయుడు. నానోటినుండి వేరుపలుకురాదు. నేనిదివరకు చెప్పినది యదార్థమ"ని యనెను. సబ్ఇన్స్పెక్టరు భటులను బిలచి "ఈమె చేతులకు గొలుసులువేసి ఠాణాకు నడుపుడ"ని యాజ్ఞయిచ్చెను. భటు లట్లు చేయుసమయమున రామయ్య పరుగునవచ్చి సబ్ఇన్స్పెక్టరు పాదములపైబడి "స్వామీ! ఆమె చెప్పింది నిజం. ఆమె ఏనేరం చెయ్యలేదండి. ఆమె దేవతవంటిదండి, గొలుసులువేసి అవమానం చేయకండ"ని పలుకసాగెను.

భటులు నివ్వెరపడి చూచుచుండిరి. సబ్ఇన్స్పెక్టరు "వెధవా! ఇందాక నాకేం తెలీదని చెప్పలేదూ? పిల్లని మోహించావ్రా?".

రామయ్య "ఇందాక భయపడ్డానండి, సాయంకాలం మళ్ళీ వస్తానన్నారుకదా. మళ్ళావస్తే చెబదామనుకున్నానండి."

•స॥ ఇ॥ "ఈమె నేరస్తురాలుకాదనియెలాచెప్పకలవు?"

రామయ్య "ఈపిల్ల అక్కడికొస్తుందనీ, ఆబాబుఅన్న స్నేహితుడు మరెవ్వరూ కారనీ నే(గహించానండి. ఆబాబు హొమ్మంటే గుడిసె దగ్గిరికిపోయి ఈపిల్లని ఆబాబు పాడు చేయకుండా అల్లరి పెడదామని వెనుక చీడీలో దాంగున్నానండి. కొంతసేపటికి పీరు హాలులోకొచ్చి పెద్ద కుర్చీమీద కూర్చున్నారో లేదో బాబు కిౖందపడ్డాడండి."

స॥ ఇ॥ "వసారాలోనుంచి నీకన్నీ కనబడ్డాయీ?"

రామయ్య "లేదండి"

స॥ ఇ॥ "ఇదియంతయు పరియాచక మనుకున్నావటరా? కళ్ళతో చూడందీ ఊహాలు చెపుతున్నావా?"

రామయ్య "ఆపిల్ల బాబుమాటలకు లొంగిపోయిందండి"

స॥ ఇ॥ "ఇంకవాగకు. నువ్వేదో దాస్తున్నావు. సిపనీపటలా" నని వానిని రెండుదెబ్బలుదుట్టి "వీడికి బేడీలు

వెయ్యండ"ని భటుల కాజ్ఞయిచ్చెను. రామయ్యరోజాబీలకు బేడీలను దగిల్చిరి. రామయ్య యకారణముగ నాచిక్కులో దగుల్కొనుటకు రోజాబీ చాలగ వగచెను. రోజాబీని పోలీసువారు అవమానించుట రోహిలాలకు జాలకష్టము కలిగెను.

స॥ ఇ॥ "మరచితిని, కట్టుకట్టిన గుడ్డ తాలూకు మిగతా ఉత్తరీయం ఎక్కడుందో ఇమ్మ"ని రోజాబీని యడిగెను.

రోజాబీ "ఉండిన ఆగుడారంలో ఉంటుంది. నాకా దృష్టి లేదు.

స॥ ఇ॥ "ఆప్పై నీవు వేసికొనిన వస్త్రముకాదా?"

రోజాబీ, "కాదు ఇదికూడా ఆలాంటిదే"

స॥ ఇ॥ "అయితే ఆబట్టకూడా నీవియ్యాలి"

రోజాబీ, "నా అభ్యంతరం లేదు. అదక్కడే వుంటుంది."

సబ్ ఇన్స్పెక్టరుకు మరల చికాకు కలిగెను. కేకలు వేయసాగెను. కాని రామయ్య చెప్పిన విషయమొకటి యాయుద్యోగి యాలోచనకి వచ్చెను. శ్రీరామమును ప్రేమించిన రోజాబీ నేరమేలచేయును. అదియే విషయము. కాని పోలీసువారికా సూక్ష్మాంశముల చర్చయవుసరము లేదు. నేరస్తురాలని నిర్ధారణ జేసినది యొక రోహిలా.

అదియేచాలును. రోహిలాలెట్టి నేరమునైన జేయగలరనియు వారిపై నేరమారోపించిన విశేషఋజు వపుసరనుండదనియు పోలీసుల విశ్వాసము.

రోజాబీరామయ్యలు రాణాకు నడువసాగిరి. రహీం టల్లా యేడ్చుచు సబ్ఇన్స్పెక్టరు కాళ్ళపైబడి "నాబిడ్డ నిరపరాధి. ఆమెను వదలవేయుడ"ని వేడుకొనెను. కాని యతనినొక తన్నుదన్ని పోలీసువారు నడువనారంభించిరి. రోజాబీ యశ్రువుల నేలరాల్చుచుండెను. గాని యామె స్వజనులతో "భగవాన్ సర్వము మేలుచేస్తాడ"ని ధైర్య వచనములు బలికెను. బీడంతయు రోదనములతో నిండి పోయెను.

అంత సాధువు పరుగునవచ్చి "రాంరాం! నాపలుకు లాలింపుడ"ని పలికెను. పోలీసువారాగిపోయిరి. స॥ ఇ॥ "ఏమిటో చెప్పండి వింటాం" సాధువు "మీకు మేలుకలుగును. వారినిరువురిని బంధమునుండి తప్పింపుడు. వారు నేరస్థులుకారు. నేను నేరస్తుడను. ఆయువకుని పొడచినది నేను. దీనితో పొడచితిన"ని యొక బాకునుజూపెను.

రోజాబీ సుందరవదనమునకు ముగ్ధులై యట్టి కల్పన కథలు పన్నుచున్నారనియెడి భ్రమ పోలీసువారిని విడువకుండెను. కాని యాసంగతులుగూడ విచారించుట యుక్తమని వారా బీటులోనికివచ్చి యచట గూలబడిరి.

సాధువు "వీరీవ్రి దేశమున బసచేసిన మరునాడు కాల కృత్యములు తీర్చుకోడానికి నేను ఈతోటలోకి రాగా ఈపిల్ల స్వారీచేయుచుండెను. ఆమె ముఖము నాకండ్లబడెను. ఆ అందం నాకండ్లను మనోబుద్ధి జ్ఞానాలనన్నిటినీ ఆకర్షించి వేసింది. నేను సాలలో కూర్చుని యెంత ఆలోచించినా ఆమెనుండి నామనస్సు మరలలేదు. సాధనమునకు లొంగ లేదు. ఇంతలో రామయ్యవచ్చి నిత్యమిచ్చు పూలనీయు మరచుట గుర్తించెను. నామనోపరివర్తన నాకే బోధపడ లేదు. నాఆలోచనలు చెడుదారిని బట్టుచుండుట నేగుర్తించి తిని. ఒకసమయమున బూర్వపు మనోబలమును చేర్చగలిగి తిని. కాని నూతనవాంఛలు పెనువృక్షముల వగది పెరగి పోయెను. తరువాత రోజాబీని కలుసుకొని నామనమూమె కెరిగించితిని. ఆమె నామాటమన్నింపలేదు. ఆమె నాకుచెప్పి నసీతులుమననంచేస్తూ మరునిభాదకుభాదపడును ఈపిల్లనిరన నకుకోపించుచు నేనుండునపుడు రోజాబీశ్రీరాములు ఒకచెట్టు క్రింద కూర్చునియుండుట జూచితిని . నాకు ఈర్ష్యకలిగినది. రోజాబీ శ్రీరామంయందు కాంచిన విశేషమేమని నేనాలో చించితిని నన్ను మన్నింపనొల్లని యువతి నాకంటె అన్నివిష యాలలో అధముడగు వతనివరించుట నాకోపకారణమైనది. ఒకచెట్టుచాటునుండి వారి సంభాషణ వినుచుంటిని. రోజాబీ ఉత్తమభావములు నామది కెక్కినపుడు శ్రీరామం ఆమెను

చెరఖ్నపురుగువలెగన్పట్టెను. ఆఖరున అతను వెడలిపోవునపుడు నేను వానిని మోడయత్నించి వెనుక పసుగెట్టితిని. నాకంటె వేగముగనడచి అతడు పోవుటచే నాచేతపడలేను. మరు నాడు వారుభవనమున కలుసుకొనుటకు శ్రీరామం ఏర్పాటు చేసాడు. అదికాకుండా చేదామని నాఉద్దేశం. సాయంత్రం బాగాపడిన తరువాత బంగాళావద్దకుపోయి చూస్తే రామయ్య లేడు. హాలుతలుపు తాళము తెరచి యుంచబడెను నేనీ బాకుతో లోనప్రవేశించి అంతయు చూచునసరికి సోఫా కనిపించెను. దానిని ఉపయోగించెదరనేభావంతో దాగొం టిని. ఏమిచేయడమో నే ఆలోచించుకోలేను. ఇంతలో శ్రీరామంవచ్చి కరదీపికతో హాలునొకసారి చూచి పైకి వెళ్లెను. నాలోకోపము చెలరేగెను. రోజాబీ నిజముగ అక్కడికారాత్రి వస్తే శ్రీరామాన్ని గాయపరచి మనో రథం తీర్చుకోలేకుండా చేతామనిపించింది. అలాచేస్తే రోజాబీకికూడా కష్టకలిగించవచ్చునని నాఊహ. నేను కూర్చున్న స్థలానికి చేరువలో వెనకవసారాలోకి వకతలుపు వుంది. దానిగడియ దీసివుంచా. శ్రీరామం ఆమె వద్దన్నా సోఫాలో బలవంతంగా మాయమాటలాడుతూ కూచోపెట్టి కౌగలింప నుద్యమించే సరికి నాకు మంచిసమయాం దొరికిం దని పొడిచా. వెనక గుమ్మంలోనుంచి పైకివచ్చేశా. నా నేరానికి ఈ అమాయకులను బాధించడం తగదు. వారి

సంకెళ్ళను విప్పడు" అనిపలికి చేతులను ముందునకుచాపెను. ఆపలుకులు విశ్వసింపకుండనుండుట యెట్లు. రోజాబీని బంధ విముక్తుం జేసిరి. ఆమె పరుగున సాధువును సమీపించి "సాధుజీ! మీరువందనీయులు పూజ్యులు. మీబిడ్డయెడల ఇంత ప్రేమ కలుగునని నే నెప్పుడూ నమ్మివుంటిని. నేకృతఘ్ను రాలను. కాని నాకొరకుకదా మీరీవలలో తగుల్కొనుట? ఎందులకు మీరు బయటపడితిరి. నాప్రైగల అనుమానంచేత నన్ను శ్రమపెట్టి నాచపలత కుచితమగు దండనము గావించి యుందురుకదా" అని సాధువు కాళ్ళపై బడెను. సాధువామెను లేవనెత్తి "బిడ్డా! క్షణోన్మాదముచే నాజీవితకృషి ఆశయములు. వ్యర్థమైనవి, సాధుజనులకు కష్టము కలిగినది. ఎన్నివిపరీతములు జరిగినవి? ఎంతపాప మార్జించితిని? నీవు పలికినట్లు ప్రపంచమున అందమగు వస్తువులెన్ని లేవు? అవన్నియు అపేక్షనీయము లగుచున్నవా? వివేచనతప్పినది. మహాపరాధ మొనర్చితిని. నిన్నియన కొట్టినదెబ్బ నాహృదయమున నాటినది. తల్లీ ఆదృశ్యము చూడకున్న నాకు పశ్చాత్తాపము కలుగకుండెడిది. అంతవరకు నీవుపకుయిను ముల జూచి సంతసించుటకొరకై చెట్టువెనుకనుండి చూచుచుంటిని. ఆదెబ్బ నాహృదయమునకు తగిలి నాపూర్వవాసనలను నాకు చేకూర్చెను. నాఉన్మాదముకు పారదోలెను. బిడ్డా! నీవుసుఖింపుము. నాకెందుండిన నొక్కటే. దండనయే

కలిగిన మరియూ ఆనందము. ఈజన్మలోని పాపమున కీజన్మ లోనే ఫలిత మనుభవింప కలుగుదువు. భగవానుడు నీకు మంగళమొనర్చుగాక" నని యామె నాశీర్వదించి సబ్ ఇన్స్పెక్టరుతో "నాయనా! జాలమేల ఆసంకెళ్ళునాకు తగుల్పుమ"ని కోరెను. రోజాబీ రామయ్యావద్దకుబోయి "రామయ్యా! నీకునసలాములు. నీదయ అపారమైనది. నాగౌరవమును కాపాడితి"వని యతని పాదములు దాకెను. రామయ్యా శరీరము పులకితమయ్యెను. అతనికేమి ప్రత్యుత్తరమిచ్చుటకును గంఠమున నేదియో నాటంకము జేయుచుండెను. వ్యర్థజీవితమని తలంచిన యతనిజీవితము నేడు కడుంగడు సుఖజీవితముగ మారెను. ఎట్టకేల కతడు రోజాబీని లేవదీసి "అమ్మా! నా మొదటి జీవితంలో నీవు సుఖవిత్తులు నాటావు. నీ మొగంచూచిన దయకలగ కేంచేస్తుందమ్మా. నీవొక దేవతవని నేనమ్ముచున్నా. నీసందర్శనమువల్లనే నా జీవితంలో గొప్పమార్పు కలిగింది. నాకుజ్ఞానం అబ్బింది. నాజన్మతరించింది. నీవు నాకగపడకుండిన నాగూనా. నేనూ తోటలో చెట్లలాబతికి చావవలసిందే" నని గద్గదకంఠుడై బలికెను.

ఇంతలో సబ్ఇన్స్పెక్టరు సాధువు చెప్పిన కథనువ్రాసి యందతని సంతకమునుకొని "సాధూజీ! నేరమును మీరు చేసినట్లొప్పుకున్నారు. మిమ్ము యేవిధంగానూ కోరకయే

మీయంతగమీరే నేరం మీపైవేసికొంటిరికదా! ఇట్లనే మేజస్ట్రీటువారి యెదుటకూడ వప్పుకోవాల"ని చెప్పెను. సాధువు "నాయనా! తప్పక ఒప్పుకుంటూ చేసినపాపం చెప్పి వేసిన కొంత ఉపశమించుననికదా పెద్దలుచెప్పిరి. అట్లనే చేసెదన"ని పలికెను. రోజాబీ యేడ్వనారంభించెను. ఆమె దుఃఖముజూచి సాధువు "బిడ్డా! ఎందుకు విలపించెదవు? నన్ను పాపకూపమునుండి ఉద్ధరించిన దేవతవు. ఆనందముగ నాకు శలవొసంగుము. నా ఆత్మ రక్షకురాలవు. నీ ఆనందము నాకుకూడ నానందమును గూర్చును. తల్లీ నాపుణ్య పునరార్జనకు జైదే మంచిస్థానము. నన్ను క్షమింపుము," అని యామెనూరార్చి పోలీసువారితో ఠాణాకుబోయెను. పోలీసువారు వెడలిపోవునపుడు సబ్ ఇన్స్పెక్టరు రామయ్య బంధమును దొలగించుచు "రామయ్యా! నీవర్తనము ప్రశంసనీయము. కాని ఒక అనుమానం ఉండిపోయింది. నీవు నెవక వసారాలోనుంటిరికదా! సాధువు వెళ్ళిపోవునపుడు చూడలేదా? అనియడిగెను.

రామయ్య, "ఆసంఘటనా విచిత్రానికి నాకుమతి చెడిపోయింది. సాధుజీని నేచూచా, ఆయనపై నాకువుండే భక్తి ఆయనగొప్ప నాకే ఆలోచనా తోచకుండా చేసాయి. అందుచేత మీకాసంగతి నేను చెప్పలేదు బాబూ. నన్ను క్షమించండి"

స॥ ఇ॥ "మంచిది. నిన్ను క్షమించితిని."

సాధువు "రామయ్యా! నీమేలుమరువను. రక్షించమని నీవు కోరినవుడే నానేరం నేను వీరికి చెప్పివుంటే నీకుగాని రోజాబీకిగాని అవమానం కలగకుండా వుండేదే. నే చేసిన పొరబాటులలో నదొకటి, నీకు సర్వదా జయము కలుగు గాక" వారు వెడలిపోయిరి.

రోజాబీ రామయ్యనుద్దేశించి "రామయ్యా! కోరక చేసిన ఉపకారం నేమరువలేను. ఇదిగో ఈ ఉంగరం నీవద్ద నుంచుకొనుము. నన్ను మరువకుము. నీవు ఆత్మ ప్రబోధితు డవు. నీవల్ల నీకేకాక సర్వప్రాణులకును మేలుకలుగు చుండును"ని యంగుళీయకమునివ్వ రామయ్య కంపిత కర ముల దానినందుకొని వెర్రివానివాలె దానిని జూడసాగెను. రహీంటుల్లా, "దైవంలేనిచోట నీవేదైవంలా మమ్మ కాపాడేవు. నాకూతురుగౌరవం నిలబెట్టావు. నీ మేలు మరవం. నీకునలాములు. అల్లానిన్ను కాపాడుగాక" నని కృతజ్ఞ వెల్లడించెను.

రామయ్య తనకుటీరమున కరగెను.

## ౧౭

శ్రీరామం స్వస్థతిజూచి యతని తలిదండ్రులు మిత్రులు నతని స్వగృహమునకు దీసికొనిపోయిరి. డాక్టరం దుల కనుమతించెను. కల్యాణి మాణిక్యము లతడింటికి వచ్చె

నని దెలసి యతనిని జూడబోయిరి. ఆలోపున సాధువు కథ యంతయు పురమున బ్రాకినది. శ్రీరామ మూవృత్తాంతమును విని "నిష్కారణముగ రోజాబీని సంశయించితిన"ని యను కొనెను. అతడు శర్మను బిలచి "శర్మా! సాధువు ఈర్ష్యచే నేరంచేసాడు. నాచాపల్యమునకు నాకుప్రాయశ్చిత్తమైంది. నాకు పూర్తిగా పశ్చాత్తాపం కలిగింది. ఆసాధువుమాత్రం బాధపడడమెందుకు, పోయి వీలైన సహాయం చేయు"ని చెప్పెను. శర్మ వెడలిపోయెను.

మాణిక్యం ముందును ఆమె చీరచెరగుబట్టి యామె వెనుక కల్యాణమును నాగదిలోనికి వచ్చినిలచిరి. శ్రీరామం కల్యాణిని జూచినపుడు అతని నేత్రము లశ్రుపూరితము లయ్యెను. కల్యాణికూడ విచారమున మునిగెను. అంత శ్రీరామం "పిన్నమ్మా! కథ అంతా తెలిసేవుంటుంది. నాకు పూర్తిగ పశ్చాత్తాపం కలిగింది. ఈగాయంతో నీజీవితములోని దుర్నడతలు తొలగిపోయెనని నావిశ్వాసము. నన్ను క్షమించి నాకీ కోమలి నర్థాంగిగజేయ నీవే సమర్థురాలవు" అని మాణిక్యమును దీనముగ వేడుకొనెను. అత డంత కల్యాణితో "కల్యాణీ! నన్ను మన్నింపుము. నీహృదయమున నాకెట్టి వ్యతిరేక భావము లుదయించినను వాటిని మరచి పొమ్ము. జన్మలో నాకీ అనుభవం చాలును. నాజన్మ

తరిరేఖించె. యౌవనాంధత వహించియున్న నానయనములు విడినవ"ని పలికెను.

మాణిక్యం "నీవు మాటాడి ఆయాసపడకు. ఏ అనుభవమైనా సరిగా అన్వయించుకున్న మేలుకలగక తప్పదు. స్వస్థచిత్తుడవగుము."

౧౮

. పిచ్చి ముసలిది నాడురోజాబీ తన్నావరించియు దన దుఃఖమును జూడజాలక వెడలి పోవునపుడామె హతాశయై నేలగూలెనుగదా! ఆమె కాయెడబాటు వత్సరము లాదిగ ననుభవించిన దానికంటె నధికకష్టతరమగుటచే నామె హృదయనాళములు పగిలి యామె నీలోకమునుండి వేరు జేసెను.

రోజాబీ నిజముగ నూర్జానే. నూర్జాన్ తప్పటడుగల నిడుచు దారితప్పి యుండునపు డాపట్టణమును వీడి వెడలు చుండిన రోహిలా లామెనుజూచి యామె సౌందర్యమునకు మెచ్చి యామెను దమతో దీసికొనిపోయిరి. వారినాయకుడగు రహీంటుల్లా నూర్జాను పేరుమార్చి తన యనంగు బిడ్డవలె సంరక్షించెను. ఆకథ ప్రస్తుతము గుంపులోనున్న నితరులకు దెలియదు. రహీంటుల్లా భార్య మరణించుటను రహీంటుల్లా యొక్కడే రోజాబీపూర్వవృత్తాంతము నెరింగినవాడు. కాని యామె పిచ్చిముసలిదాని కూతురని యెరుం

గడు. జాక్ బీ ఆషాబీలు పిచ్చిదాని కథ తెలుపునపు డతను తల వ్రాల్చి యుండుటకా రహస్యమును రహస్యముగ నుంచవలెననెడి తలంపు కారణము.

పిచ్చిదియు మరణించుటచే నారహస్యము తన హృదయమున భద్రముగ నుండుననెడి నమ్మకము రహీంటుల్లాకు గలిగెను. రహస్యవిచ్ఛేదనము రోజాబీకి విచారకారణమగుననియు నామె విచారమతని ప్రేమహార్మ్యభేదకమగుననియు నతనివిశ్వాసము.

అట సాధువు మేజస్ట్రీటు యెదుట నేరము తాను జేసి నట్లొప్పుకొనెను. మేజస్ట్రీటు దీర్ఘముగా నాలోచించి "ఉన్మాద ఉద్రేకములచే నేరము గావింపబడుటను వారం రోజులు విడికైదుగ శిక్షించితిన"ని తీర్పుచెప్పెను. శర్మయు శ్రీరామంతో నాసంగతిచెప్పి "అంతవరకు తగ్గించుటకే కష్టమైంది. సాధువు సంతసమున శిక్షను స్వీకరించెన"ని పలికెను.